
స్వాతంత్ర్యాన్ని
స్వేచ్ఛగా మార్చడం
విదేశ పాలనా శృంఖలాలు పగలగొట్టి 43 ఏళ్ళ క్రితం
మనం స్వాతంత్ర్యం పొందాము.
[illegible]లైన స్వేచ్ఛకు మన ప్రయత్నము మొదలైంది శ్రమజీవుల
జీవితాలు మెరుగుపడేటట్లు చేసేంతవరకూ ఆ ప్రయత్నం
కొనసాగుతుంది
అట్టడుగున ఉన్నవారి కన్నీళ్ళు మనం తుడిచే దాకా మన
స్త్రీల హోదా మెరుగుపరిచే దాకా అందరికీ సరైన ఉద్యోగ
వసతి కల్పించేంతవరకూ గ్రామీణ ప్రాంతాలు ఆర్థికంగా
బాగుపడేంతవరకూ మన ప్రజాస్వామ్యపు వేళ్ళు ఇంకా
లోపలికి పోయేంతవరకూ
స్వేచ్ఛ కోసం మన యాత్ర
కొనసాగుతుంది.
davp 90/303 TFL

JAGATI Rs. 2-00 October 1990

35th Year of Publication




## అక్టోబరు - 1990

## సాహితీ సుధ

వగ గొను లోభముం బిశునభావము సత్యము చిత్త శుద్ధి యుం
దగు సుజనత్వమున్ సుమహితత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన దుర్గుణంబు దురితంబు దంపబును దీర్ఘసేవ భృ
త్యగణము సౌమ్ములుం ధనచయంబును జావును వేరుయున్నదే

—భర్తృహరి



మర్కటం బెఱుగునే మంచిముత్యపు సరు-ల్బధిరు డోపునె గానవిధము దెలియ
గార్ధభం బెఱుగునే కస్తూరివాసన - మూర్ఖు డెఱుంగునే ముక్తిపథము
అంధకుం డెఱుగునే యర్కుని తేజంబు - ఖలు డెఱుంగునే ధర్మకథలపొందు
దురితాత్మ డెఱుగునే కరుణతో రక్షింప - ధనలోభి యెఱుగునే దానగుణము
ప్రాజ్ఞులకుగాని వివరింప భవ్యగుణము - లేల గల్గును మూర్ఖుల కెన్నిగతుల
ప్రణుతధవళాంగ మౌనిహృత్పద్మభృంగ - అమిత భవభంగ శ్రీ కాళహస్తిలింగ

—కాళహసిలింగ శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : రాధాకృష్ణన్

# నిమ్మ తొనలు

పట్నం నుంచి వచ్చిన ప్రకాశరావు, రచ్చబండదగ్గిర కనిపించిన పెద్ద మనిషిని, "సోమసుందరంగారు మీకు తెలుసా ?" అని అడిగాడు.

"తెలుసు"

"ఆయన ఏ వీధిలో ఉంటారో తెలుసా ?"

"తెలుసు."

"ఆయన యిప్పుడు ఇంట్లో వుంటా రంటారా ?"

"ఊహూ"

"మరి, నాకెక్కడ దొరుకుతారు?"

"ఇక్కడే - నేనే నయ్యా సోమ సుందరాన్ని !"

—వి శ్యామ్రావు
కర్నూలు-4

నవలల పోటీలో మొదటి బహుమతి అందుకున్న వెంకట్రావు గౌరవార్థం, సదాశివమ్ ఒక చిన్న విందు ఏర్పాటు చేశాడు. పాతికమంది దాకా వచ్చారు. అతిథులు ఒక్కొక్కరు రావడంతో వెంకట్రావుముఖం వివర్ణం కాజొచ్చింది.

మిత్రుని ముఖ కవళిక కనిపెట్టిన సదాశివమ్ అడిగాడు : "ఏమిటి అలా బిత్తర చూపులు చూస్తున్నావ్ ? ఒంట్లో బాగాలేదా ?"

"గుండె దడదడలాడుతోంది...."

"ఎందుకని - ఎప్పట్నుంచి ?"

"ఈ గెస్టులని చూస్తున్నకొద్దీ గుండె దడ ఎక్కువవుతోంది. నన్నిప్పుడు మాట్లాడమంటారు. వ్రాయటమేతప్ప మాట్లాడటం చేతకాదే ! నేను ఒకవేళ ధైర్యంచేసి మాట్లాడేందుకు నిలబడ్డానా బుర్ర చతికిలబడుతుంది."

"ఓస్, అంతే కద - వాళ్లకి హెూషలే తప్ప, బుర్రలు లేవని జ్ఞాపకం పెట్టుకో," - అని సలహా యిచ్చాడు సదాశివమ్.

వెంకట్రావు ఎంతసేపు మాట్లాడా డంటే, 'బాబూ, ఇక ఆపవయ్యా, విస్తళ్లలో వడ్డించినవి చల్లారిపోతు న్నాయి,"- అని సదాశివమ్ చెవిలో చెప్పేదాకా !

—అర్ నారాయణరావు
హైదరాబాదు-7

ఎందుకయ్యా యింత చిన్న విషయా నికి మీరు కోర్టుకొచ్చారు. మీలో మీరు పరిష్కరించుకోవచ్చు కదా ! డబ్బు దండగ, కాలం వృధా చేసుకోవ డం, అనవసరంగా మనస్పర్ధలు"- అంటూ మందలించారు జడ్జీగారు.

"మేమూ అదే అనుకున్నాం, సార్. కాని, ఈ పోలీసులా ప్లీడర్లూ మమ్మల్ని బతకనిచ్చారా? రాజీకి రానివ్వ లేదు..."

—యల్ జనార్దన్
తిరుపతి

త్తమ పత్రిక సర్క్యులేషన్ పెంచేందుకు ఊహా పోహాలు గల ఒక సంపాదకుడు 'అయిదేళ్లామధ్య పెళ్లయిన దంపతులు' అను ఒక శీర్షిక ప్రవేశబెట్టి, చురుకైన లేడీ జర్నలిస్ట్ సుభద్రని, ఆయా సంసారాలని, స్త్రీలని యింటర్వ్యూ చేసేందుకు పంపించాడు. 'పురుషులు మూడు ముక్కల్లో తేల్చేస్తారు, స్త్రీలైతే సావకాశంగా తమ పెళ్లి కథ చెబుతారు'- అని ఆ సంపాదకుని నమ్మకం.

కళ్యాణీ కామేశ్వరరావులని యింటర్వ్యూ చేసి, వారి సర్వసాధారణ వైవాహిక జీవితం నుంచి, రసవత్తరమైన 'స్టోరీ' తయారు చేయవలసిన భారం సుభద్రది.

ఈమె వెళ్లేసరికి కామేశ్వరరావు ఆఫీసుకి వెళ్లిపోయాడు. కళ్యాణి ఒక్కర్తె ఉంది.

"మీ పెళ్లి 1986 లో జరిగింది కదా?"- అని ప్రశ్నించింది సుభద్ర.

"అవును"- అని కళ్యాణి జవాబు.

"ప్రేమ పెళ్లా? పెద్దలు కుదిర్చినదా?"

"ప్రేమపెళ్లే - నీ తోడిదే లోకం; నీవు లేకపోతే బతకలేనన్నారు."

"ఇంకా....?"

"ఇంకా ఏముంది? ఇదిగో ఈ యిద్దరు పిల్లలు...."

—పి జానకి
గుంటూరు-2

యుద్ధానికి వెళ్లివచ్చినవారి కబుర్లు సరదాగా ఉంటాయి - వారు యుద్ధం చూశారుగనక! చంద్రుని గురించి కవులు చెప్పే కబుర్లు కఠోరంగా ఉంటాయి - వారు చంద్రుని వద్దకు వెళలేదు గనక!

-మార్క్‌ట్వేన్


జి. పుల్లారెడ్డి
స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను : 230833

కర్నూలు
ఫోను 20288, 21445

# పాఠకుల తీర్పు

చందూర్ దంపతులకు : నమస్కారం. ఆ రోజు మీరిద్దరూ వచ్చేసరికి ఎంత ఆనందం కలిగిందో చెప్పలేను. 29 ఏళ్లక్రితం, 1961 లో పెళ్లయిన కొత్తలో, హేమ నన్ను మీకు పరిచయం చేసింది. అనుకోకుండా మిమ్మల్ని చూడగానే అదంతా గుర్తొచ్చింది.... తీసుకోవలసిన జాగ్రత్తలలో హేమ ఏ మాత్రం వెనకాడదు. తొందరగానే కోలుకుంటున్నాను.... పిల్లలు సికింద్రాబాదులో ఉన్నారు. మేము యిక్కడికి జూన్ 28వ తేదీనవచ్చాము. ప్రతి నెలా 'జగతి' మీ కబుర్లు చెబుతూ వుంటుంది.

—యమ్‌సి దాసు
గౌహతి (అస్సామ్)

ఆర్యా : జులైనెల 'జగతి'లో (వెన్నెల కెరటాలు) 1986 జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత 'సచ్చిదానందరాయ్ చౌదరి' అని ఉంది. ఆయన పేరు 'సచ్చిదానంద రౌత్ రాయ్'....1939 లో ఆయన రచించిన దీర్ఘ కవిత పేరు 'బాణీరావుత్'.... వారి సతీమణి భూదేవి తెలుగువారి ఆడబడుచు.... ఆయన కథ 'జాగీరు' అన్నది. నేను అనువదించి 'విపుల' పత్రికలో ప్రచురించినప్పుడు, ఆ సంస్థవారు ఆయనకు, డైరక్టుగా వందరూపాయలు డ్రాఫ్ట్ పంపగా, అందుకొని, పొంగిపోతూ, మా యింటికి వచ్చి ఈ సంగతి చెప్పారు. ఒడియాలో మొదటి జ్ఞానపీఠ్ అవార్డ్ పొందిన వ్యక్తి పేరు 'గోపీనాథ్ మహంతి'.

—భట్టిప్రోలు కృష్ణమూర్తి
భువనేశ్వర్ (ఒరిస్సా)

చందూర్ దంపతులకు : నమస్కారములు.... మోహన్ బాగున్నారు. బొట్స్‌వానా రైళ్లు రోజూ పరిగెడుతూనే వున్నాయి.... లోకల్ టివిలో సాయింత్రమే సినిమాలు వేస్తారు - అడ్వర్టయిజ్‌మెంట్లు తప్ప ఏమీ ప్రోగ్రాములు వుండవు, తక్కిన రెండు మూడు ఛానెల్సూ సౌత్ ఆఫ్రికావే !.... తెలుపు నలుపుల మిశ్రమం అక్కడి ప్రజ.... బెర్లిన్ వాల్ విరగ్గొట్టడం - ఆ ఎమోషనల్ క్రయిసిస్ అంతా - టివిలో చూశాం.... మొదటి సారి మొన్న ఆదివారం లోకల్ టివి లో, అమితాబ్ హిందీలో పిక్చర్ వేశారు.... కల్చరల్ ఎక్స్‌ఛేంజి ప్రోగ్రామ్‌లో ఈ మధ్య కథక్ ట్రూప్ వచ్చి ప్రదర్శనలిచ్చింది. నటరాజ రామకృష్ణ పోయిన సంవత్సరం వచ్చారట. మద్రాసు విశేషాలు 'జగతి' ద్వారా తెలుస్తున్నాయి.

—వాణీమోహన్
హబరోని (బొట్స్‌వానా)

# వెన్నెల కెరటాలు

## రూపాయి

ఆంగ్లేయులు మొగలాయిల నుండి నాణేలు ముద్రించే హక్కును గ్రహించే సమయానికి 994 వివిధ రకాల బంగారు, వెండి నాణేలు అమలులో ఉండేవి. వాటిలో ముఖ్యమైనవి మద్రాసులోని ఆర్కాట్ రూపాయి, బెంగాలులోని సిక్కా రూపాయి, బొంబాయిలోని సూరత్ రూపాయి. వీటికి ఉపయోగించే వెండి కూడా బరువులోనూ పరిశుద్ధతలోనూ వ్యత్యాసం ఉండేది. ఆర్కాట్ రూపాయిపై శివుని ఆయుధమైన త్రిశూలం ఆకారంలో కమలం ఉండేది. ఇదేవిధంగా బొంబాయి నాణేలపై కిరీటం, బెంగాల్ నాణేలపై గులాబీ ఉండేవి. మిగిలిన అన్ని విషయాలలోనూ దాదాపు ఒకేలా ఉండేవి. 1835 లో ఈస్ట్ ఇండియా మొట్టమొదటిసారిగా దేశవ్యాప్తంగా రూపాయలును అమలులో పెట్టింది. వాటిపై అప్పటి బ్రిటిష్ రాజైన విలియమ్ - IV బొమ్మ పేరుతో సహా ముద్రించబడి ఉండేది. 1840 లో ముద్రించిన వాటిపై మహారాణి విక్టోరియా పేరు ఉండేది. ఈస్ట్ ఇండియా కంపెనీ నుండి పరిపాలనా భారాన్ని స్వాధీనం చేసుకున్న తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం ఈస్ట్ ఇండియా కంపెనీ పేరును తొలగించి బ్రిటిష్ రాజు బొమ్మ ముద్రించడం మొదలుపెట్టారు.

—వ్యాసభాగం
'సైనిక సమాచార్'

## టాగోరు

1905 నుండి టాగోరు ప్రతిపాదించిన సంస్కరణల్ని గాంధీగారు ముందుకు తీసుకుపోయారు. పాశ్చాత్య విద్య కాకుండా జాతీయ విద్య కావాలన్నారు. సహకార బ్యాంకింగు విధానం ఆచరణాత్మకంగా చేసి చూపారు. రైతులకు ఋణాలు ఇప్పించి వ్యవసాయాభివృద్ధి చేశారు. ఆయన స్థాపించిన కృషి నికేతన్‌లో వ్యవసాయ వృత్తి పనులు నేర్పేవారు. ఈ అంశాన్నే స్వతంత్ర భారత దేశంలో నెహ్రూగారు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రోగ్రాంగా మార్చారు. టాగోర్ నడిపిన శ్రీనికేతనంలో చదువుతో పాటు బతుకుదెరువుకు అవసరపడే వృత్తి విద్య నేర్పేవారు. అదే ఆ తరువాత బేసిక్ ఎడ్యుకేషన్‌కి ప్రాతిపదిక అయింది.

—జగ్గయ్య
'కోసావాణి'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

## అనురూపావారి 'పల్నాటి యుద్ధం'

శ్రీనాథ మహాకవి, తన పల్నాటి యుద్ధ ద్విపద కావ్యరచనలో, పంచమ వేదమనదగు భారతాన్ని పల్నాటి సీమకు అన్వయింపజేసి, భారతంలోని అభిమన్యుని బాలచంద్రునిగా మలిచాడు. మహాభారతం యుద్ధపంచకంతో పూర్తికాదు. కాని శ్రీ నాథుడు, శివ వైష్ణవ వైరమూ పరస్పర అసహనమూ, పాలకుల కుత్సితాలూ కుటిలనీతి, చివరికి రక్తపుటేరై పారక తప్పదని, తన పల్నాటి వీరగాథ ద్వారా హెచ్చరిక చెబుతాడు .... అనురూపావారు కథా ప్రారంభాన్ని అద్భుతంగా ఎత్తుకున్నారు. కాని, ముగింపు దగ్గిర కొచ్చేసరికి ఫిలిమ్స్ డివిజన్ వారి వార్తా చిత్రంలా తయారయింది. బ్రహ్మనాయని పాత్రలో గాంధీ గారి అహింసా సిద్ధాంతమూ హరిజనుల దేవాలయ ప్రవేశమూ జోడించడంతో, ఆ పాత్ర చారిత్రకాధారము లేనిదై గాలిలోతేలింది. నాయకురాలి పాత్రను కొంచెం సమర్థనీయంగా సృష్టించి నేర్పుగా రూపొందించారు. 'ఈ గేమ్ నేను వోడిపోయాను. మళ్లీ ముక్కలు పంచండి, ఆడదాం' - అన్నట్లు, మహా తేలికగా, తన ఓటమి వొప్పేసుకోవడంతో. పటపా కంపె పిడుగు పడటయింది. ఇకపోతే, బాలచంద్రుని వేశ్యాలోలత్వం, మాంచాల తనకు లభించిన ఆ ఒక్కరాత్రినీ, ఆ ఒక్కరాత్రి భర్త పొందునీ, త్యాగం చేయడం, జ్యోతిష్కుల మాటలే శిలాక్షరాలుగా, ప్రజాక్షేమంకోసం పసిగందు తల నరకమని బ్రహ్మనాయుడు, తలారులకు తన కొడుకుని వొప్పగించడం, మాంచాల సైనిక దుస్తులతో యుద్ధభూమిలో మరణించడం - యిలాటివి కొన్ని ఆనాటి సామాజిక వాతావరణానికి ఎంత మాత్రం అతకవు. పల్నాటి వీరగాథ ఎటువంటి స్పర్ధలతో ప్రాణం పోసుకున్నదో చెప్పాలిగాని, నేటి భావాలు ఆనాటి ప్రజకు అన్వయించడం వల్ల కళారూపం దెబ్బతింటుంది .... బ్రహ్మనాయనిగా యన్‌టి రామారావు, బాలచంద్రునిగా హరనాథ్, నలగామ రాజుగా గుమ్మడి, నరసింహరాజుగా రాజనాల, అలరాజుగా కాంతారావు, కన్నమ నాయనిగా మిక్కిలినేని, వీరభద్రునిగా త్యాగరాజు, మాంచాలగా జమున, నాయకురాలిగా భానుమతి గల ఈ సంగీత సాహిత్య రసోద్దీపిత చిత్రానికి దర్శకులు : రామినీడు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - ఏప్రిల్ 1966

# మానవ ప్రగతి

## గ్రేటా గార్బో

మున్నెన్నడూ .... మరే ఇతర చలనచిత్ర తారకు సాధ్యం కాని రీతిలో .... 1930 దశకంలో అసంఖ్యాక సినీ ప్రేక్షకుల ఊహల్ని ఉష్ణీకరించి, ఒక అర్ధ శతాబ్దానికి పూర్వం తాను హాలీవుడ్ నుంచి నిష్క్రమించిన తర్వాత కూడా ప్రేక్షకుల స్మృతి పథంలో చిరంజీవిగా మిగిలిపోయిన మహానటి గ్రేటా గార్బో .... ఇప్పుడు తన మరణానంతరం కూడా ప్రపంచ వ్యాప్తంగా గల అభిమానుల గుండెల్లో తన ప్రత్యేక స్థానాన్ని అలాగే నిలుపు కొంటోంది ! గత అయిదు దశాబ్దాలలో తాను ఎంత ప్రశాంతంగా జీవించిందో అంతే ప్రశాంతంగా ఈ ఏడాది తొలి భాగంలో.... తన 84 వ ఏట, గ్రేటా గార్బో కన్ను మూసింది. "హాలివుడ్ మహారాణి" గా తను వెలుగొందిన కాలంలో ఆమె సాటిలేని ఆకర్షణ శక్తిని, అపూర్వ 'మాయా జాలాన్ని' ప్రదర్శించింది. అద్భుతంగా చెక్కి నట్టుండే అందమైన వదనం, భావా లను పలికించే కాంతివంతమెన కళ కలిగి .... జన్మతః 'స్వీడిష్' మహిళ అయిన గ్రేటా గార్బోని, 'సర్వకాలా లకు చెందిన సాటిలేని మహానటి' గా పలువురు పేర్కొంటారు. స్టాక్ హోమ్ లో జన్మించిన గార్బో అసలు పేరు గ్రేటాలొవిసా గుస్తాఫ్సన్. విద్యా విహీ నుడైన ఒక కార్మికుని కుమార్తెగా ఆమె దుర్భర దారిద్ర్యంలో పెరిగింది. తన 14 వ ఏట తండ్రిని కోల్పోయింది. అప్పుడామె ఒక 'డిపార్ట్‌మెంట్ స్టోర్' లో గుమాస్తాగా పని చేసేందుకై చదు వుకు స్వస్తి చెప్పేసింది. అక్కడ పని చేస్తుండగానే ఆమెకు ఒక 'అడ్వర్టయిజ్ మెంట్' చిత్రంలో నటించే అవకాశం లభించింది. అది బాగా పేరు పొంద డంతో ఆమె మరికొన్ని పబ్లిసిటీ చిత్రా లలో కూడా నటించగలిగింది. అటు పిమ్మట ఆమెకు 'పీటర్ ది ట్రాంప్' (1922) అనే హాస్య చిత్రంలో నాయిక పాత్ర లభించింది. ఆ తర్వాత ఆమె స్టాక్ హోమ్‌లోని రాయల్ డ్రమె టిక్ థియేటర్ ట్రయినింగ్ స్కూల్‌లో చేరి, అక్కడే రెండేళ్లపాటు తన శిక్ష ణలో భాగంగా రంగస్థలంపై చిన్న చిన్న పాత్రలు నటించింది. కాగా,

అప్పటి స్వీడన్ అగ్ర దర్శకుడు మారిట్జ్ స్టిల్లర్ ప్రోత్సాహం లభించడం, ఆమెనట జీవితాన్ని పెద్ద మలుపు తిప్పింది. స్టిల్లర్ ఆమెకు నిర్విరామ శిక్షణ నిచ్చి .... ఆమె ప్రపంచంలోకెల్లా మహానటి అవుతుందని ఘంటాపథంగా చెప్పి మరీ ఆమెను తారాపథంలో ప్రవేశపెట్టాడు. స్టిల్లర్ ఆమె పేరును 'గార్బో' గా మార్చి 1924 లో తను రూపొందించిన 'ది సాగా ఆఫ్ గోస్టా బెర్లింగ్' చిత్రంలో ప్రధాన పాత్రలో నటింపజేశాడు. డైరెక్టర్ స్టిల్లర్ 1925 లో గార్బోని హాలీవుడ్‌కి తీసుకెళ్లాడు. 1926 లో నిర్మితమైన 'టోరెంట్' అనే తన తొలి హాలివుడ్ చిత్రంలో ఆమె ఒక స్పానిష్ రైతు యువతిగా నటించింది. తన తదుపరి చిత్రమైన 'ది టెంప్ట్రెస్' (1926)లో గ్రేటా గార్బో సుఖశాంతులు లేని ఒక వివాహిత మహిళగా నటించింది. అందులో.... తనకు పరిచయమైన పురుషులందరూ తన పట్ల పిచ్చిగా ప్రేమను పెంచుకోవడం ఆమె దురదృష్టంగా వుంటుంది. ఈ చిత్రం ఆమెకు విరకీర్తిని ఆర్జించి పెట్టింది. హాలీవుడ్‌లో 10 'మూక సినిమా'లలో నటించిన అనంతరం గ్రేటా గార్బో చివరికి 'అన్నా క్రిస్టీ' (1930) చిత్రంలో 'మాట్లాడే పాత్ర' ధరించింది. ఆ చిత్రం ద్వారా వినిపించిన 'తొలి పలుకులు' ప్రేక్షకుల్ని ఉర్రూత లూగించేశాయి. 'గార్బో టాక్స్' అనే ఎం జి ఎం స్టూడియో 'పబ్లిసిటీ స్లోగన్' ఒక్కటే ఆ చిత్రాన్ని పెద్ద 'బాక్సాఫీస్ హిట్' గా మార్చేసిందనడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. అటు తర్వాత 1939 లో వచ్చిన 'నినోచ్కా' హాస్య చిత్రం గార్బోకి మరింత పేరు ప్రఖ్యాతులు తెచ్చింది. 'టు - ఫేస్డ్ వుమన్' అనే మరొక చిత్రంలో తను ధరించిన మరొక హాస్య పాత్ర అపజయం పొందడంతో, గార్బో తను చలనచిత్ర రంగం నుంచి నిష్క్రమిస్తున్నట్లు ప్రకటించింది. అప్పటికి ఆమె 24 చిత్రాలలో నటించింది. ఇలా వుండగా 1955 లో 'ఎ సిరీస్ ఆఫ్ లూమినస్ అండ్ అన్‌ఫర్గెటబుల్ పెర్ఫార్మెన్సెస్' లోని నటనకు గాను ఆమెకు 'అకాడమీ' నుంచి ప్రత్యేక 'ఆస్కార్' అవార్డు లభించింది. అయితే ఆ బహుమతిని స్వీకరించడానికి గార్బో వెళ్లలేదు. అంతకు ముందు 'అన్నా కెరెనినా' పాత్ర పోషణకు, ఇంకా 'కామిలి' లోని పాత్ర పోషణకు ఆమెకు రెండేళ్ల పాటు వరుసగా 'న్యూయార్కు ఫిలిం క్రిటిక్స్ అవార్డు' లభించింది. కేవలం 36 ఏళ్ల వయసులో.... తన చలన చిత్ర జీవితం తారస్థాయిలో వున్న దశలో.... 1941 లో సినిమా రంగానికి 'గుడ్ బై' చెప్పిన గ్రేటా గార్బో నిర్ణయాన్ని మార్పించి, ఆమెను తిరిగి చిత్ర రంగానికి రప్పించి.... ఆమె ప్రతిభా సామర్థ్యాలను మళ్లీ వినియోగించుకోవాలని ఎందరో దర్శకులు ప్రయత్నించారు. అయినప్పటికీ వారి ప్రయత్నాలు ఫలించలేదు. డేవిడ్ ఒ. సెల్జినిక్ 'స్పెల్ బౌండ్' లోని ప్రధానపాత్రకు

గార్బోని తీసుకోవాలనుకున్నారు. కాని చివరికి ఆ పాత్ర ఇంగ్రిడ్ బెర్గ్‌మన్‌కి దక్కింది. 'ది గార్డెన్ అఫ్ అల్లా'లో గార్బో నిరాకరించిన పాత్ర మార్లిన్ డిట్రీవ్‌కి వెళ్లింది. 'మేడమ్ క్యూరీ' జీవిత గాథపై ఒక చిత్రానికి.... కేవలం గార్బోని దృష్టిలో వుంచుకునే పథకం సిద్ధం చేశారు. అయితే గార్బో దానిని కూడా త్రోసి పుచ్చడంతో గ్రీయెర్ గార్సన్‌కి ఆ పాత్ర నిచ్చారు. సినీ జీవితం నుంచి నిష్క్రమించిన తర్వాత గ్రేటా గార్బో అత్యంత ఆశ్చర్యకరమైన రీతిలో ఆ తర్వాత అయిదు దశాబ్దాల కాలాన్ని పూర్తి ఏకాంతంలో.... ప్రజల దృష్టికిదూరంగా గడిపారు. 'గ్రాండ్ హెూటేల్' అనే చిత్రంలో ఆమె చెప్పిన 'అయ్ వాంట్ టు బి అలోన్' అనే అతి ప్రసిద్ధ వాక్యం, ఆ మహానటి గురించి, ఆమె జీవితాన్ని గురించి అతి కొద్ది పదాలలోనే అయినా అత్యంత వాస్తవికంగా విశదం చేస్తున్న దనవచ్చు.

## జీవకోటి

భూతలానికి చుట్టూ ఆవరించిఉన్న ప్రదేశంలో జీవజాలం అభివృద్ధి చెందడానికి అనువైన ప్రాంతాన్ని జీవమండలం అంటారు. భూమి ఉపరితలంపై కొద్ది కిలోమీటర్ల వరకుగల భాగం (వాతావరణ మండలం), నీటి ఉపరితలంపై కొద్ది మీటర్ల నుంచి కిలోమీటర్లవరకు (జలమండలం), నేలపై కొన్ని సెంటీమీటర్ల వరకుగల ప్రాంతం జీవసంపద మనుగడకు అనుకూలంగా ఉంటుంది. ఈ జీవమండలంలో విభిన్నమైన చెట్లు, మొక్కలు, జంతువులు, సూక్ష్మజీవజాలం మనజీవసంపదలోని విభిన్నత్వానికి ప్రతిబింబాలుగా ఉన్నాయి. వీటన్నింటికి ఆధారం అంతరిక్షం నుంచి లభించే సూర్యకిరణాలే. జీవమండలంలోని ఒకదానిని మరొకటి ప్రభావితం చేస్తూ మనుగడ సాగిస్తూ ఉంటాయి. మన సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక జీవనరంగాలను ఈ జీవకోటి ఎంతగానో ప్రభావితం చేస్తుంది. అంతేకాక ఈ జీవకోటి మానవాళి వర్తమాన అవసరాలను తీరుస్తూనే, భావితరాల పట్ల శ్రద్ధ వహిస్తుంది. అందువల్ల వర్తమాన స్థితిని మాత్రమే కాక, భవిష్యత్ రూపాన్ని కూడా ఈ జీవమండలం పరిణామాలే తీర్చిదిద్దుతాయి. పంటలకు సంబంధించిన జన్యు పరిశోధనల విషయంలో, వాటి పరిరక్షణ విషయంలో మన దేశం అద్భుతమైన ప్రగతి సాధించింది. అయితే సహజ పరిస్థితులలో పెరిగే జీవకోటి పరిరక్షణ విషయంలో కూడా అంతటికృషి చేయవలసిన అవసరం ప్రస్తుతం ఉంది. రకరకాల చెట్లు, మొక్కలు, జంతువులు, సూక్ష్మజీవులన్నింటిని కలిపి, వాటి సహజనివాస ప్రాంతంలోని జీవజాలవు వైవిధ్యంగా అభివర్ణించవచ్చు. ఒకే జన్యువర్గంలో ఉండే విభిన్నతలు కూడా మానవ కోటికి ఎంతో ఆసక్తిదాయకమైన అంశం.



?

"Sabari tasted the fruit first to find out whether it was bitter or sweet and then offered it to Rama who relished it with delight. Was that the way of giving salvation to a devotee?" questioned Raghu.

"You are being carried away by common folklore yarn. Sabari was anxiously waiting for Rama for more than two years and stored up a lot of dry fruit and honey for him," said Raghu's Father.

"Was she not a devotee of Rama?"

"Not exactly. Sage Matanga ordained her. She was an inmate of Matanga Ashram and when Matanga and his disciples were about to cast off their earthly bodies, Sabari, having served them all her life, requested of Sage Matanga a similar deliverance. 'Not yet time for you. Rama will come this way and his grace enables you break all the shackles,' said Sage Matanga. The golden moment arrived. After serving Rama with fruit and honey, this old lady with folded hands, got on to the sacrificial fire and Rama was a witness to the brilliant light emanating from the pyre and he bowed in reverence,"

explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*



# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



కూచిపూడి భాగవతుల వీధి నాటకములు, చెంచునాటకములు. యివి జన సామాన్యాన్ని మెప్పించేవి. నాగరికపు నాటకములు 1890 ప్రాంతాన ధార్వాడ కంపెనీతో ప్రారంభమయాయి. ఆ తర్వాత పార్శీ నాటకాలు.... బళ్లారిలో ధర్మవరము రామకృష్ణచార్యులు సరస వినోదినీ సభ. నాటక రచనతో బాటు పాత్ర ధారణ కూడా చేసేవారాయన. వారి మేనల్లుడే బళ్లారి రాఘవాచారి. తోలేటి వెంకట సుబ్బారావు 'హరిశ్చంద్ర' చిలకమర్తి వారి 'కీచక వధ,' కోలాచలం వారి 'విజయనగర సామ్రాజ్య పతనం' వేదం వేంకటరాయ శాస్త్రి 'ప్రతాప రుద్రీయం'.... అనాటి ఆంధ్ర నాటక రంగం గురించి కేసరిగారు చెబుతున్నది చదవండి.

రాణివేషమున వడివేలుగారు తీరైన పాట, కస్తూరి తిలకము, ముఖమున చిరునవ్వు నాకు ఇప్పటికిని మరుపు వచ్చుటలేదు.

క్రమముగా నీ సభయందు మొదట ఆంగ్లాంధ్ర ద్రావిడ నాటకశాఖ లేర్పడినను, చిరకాలము సాగినవి, తెలుగు తమిళ శాఖలే అని వ్రాసియున్నాను. ఈ సభాసభ్యులలో తమిళదేశపు తెలుగువారును కొందరు సభ్యులైయుండిరి. వారు తెలుగు నాటకముల పాత్రల ధరించుచుండిరి. ఎప్పుడైనను, ఈ సభ వారి తెలుగు నాటకములలో బళ్లారి రాఘవాచారిగారును, నెల్లూరివారైన కందాడై శ్రీనివాసన్ (దొరస్వామి) గారును వేషములు వేయుచుండిరి.

నేను మొదటచూచిన వీరి తెలుగునాటకము 'వరూధిని.' ఈ సభాసభ్యులలో కృష్ణస్వామి అయ్యర్‌గారను వారొకరుండిరి. వరూధిని పాత్రను ఆ అయ్యర్‌గారు ధరించేవారు. వీరి కంఠస్వరము కిన్నెర స్వరమును బోలి యుండును. వీరి పాటలను వినుటకు ఊరి పెద్దశెట్లందరును వచ్చేవారు. వరూధిని పాత్రధారులై ప్రవరాఖ్యుని ప్రథమ పరిచయపు పట్టునందు—

"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర"

అను పద్యమును చదువుచు, అభినయమునకై కండ్లు, నోరు తెగ తెరిచేవారు; రెండు చేతులను బారజాపేవారు. పెద్దన కవితామాధుర్యము నంతయు, అయ్యరుగారు సొంతముగా సొపడేవారు. వీరు ముసలివారయి పొట్ట పెద్దదయ్యేవరకు స్త్రీవేషము వేయుట మానలేదు. ఈ సభవారు నెల్లూరునకు వచ్చి వరూధిని నాటకమును ప్రదర్శించిరి. గాని అచ్చటి తెలుగు వారికి ఈ తెలుగునాటకము అంతగ రుచింపనందున, వీరిని వారు బాగుగా ఆదరింపలేదు.

## చంగాబజారు నాటకములు

మద్రాసులో సుగుణవిలాస సభయేగాక మరికొన్ని నాటకకంపెనీలున్నూ వెలిసియుండెను. ఇప్పుడవి అంతరించినవి. నా చిన్నతనములో అవి యొక వెలుగు వెలిగినవి. వానినిగూర్చి తెల్పెదను. జార్జిటౌన్‌లో చంగాబజారు అని యొక వీధి యుండెను. ఆవీధిలో నాటకముల నాడుటకు కొఠాయి యొకటి వేయబడి యుండెడిది. అక్కడ అప్పుడు మద్రాసు తమిళులు తమిళ నాటకము లాడేవారు. నేను చూచిన మొదటి నాటకము "డంబాచారి విలాసము" అనే నాటకము. దీనిని బాలామణి, కోకిలాంబ అనేవేశ్యలు

ముఖ్యపాత్రలు ధరించి నడిపించేవారు. వీరిద్దరు అక్కచెల్లెండ్రు. వీరు భోగమువారైనను ఆ కాలమున తమతోకూడ యొకపురుషుడు వేషమువేయుట కిష్టపడెడువారు కారు. అందువలన వారిలో పెద్దదియగు కోకిలాంబ పురుష వేషమును, చిన్నదియగు బాలామణి స్త్రీ వేషమును ధరించేవారు. డంబాచారి విలాస నాటకమునందు అనేక శృంగార రసపూరితములగు వేషభాషలుండుట చేత పురజనులు రంగస్థలమంతయు నిండియుండెడు వారు. ఈ బాలామణి మంచిరూపసి. సంగీతవిద్వాంసురాలు. డంబాచారితో సరస సల్లాపము లాడుట నటించునప్పుడు సందర్భానుసారముగ మంచి తెలుగు జావళీలను పాడి ప్రేక్షకులను ఉద్రేకులుగ జేయుచుండెడిది.

మరియు ఈమె తారాశశాంకమున కూడ వాకచక్యముతో నటించుచుండెను. ముఖ్యముగ ఈనాటకములో తార చంద్రునకు తల అంటు ఘట్టము విలక్షణమైనది. అప్పుడే తార చంద్రునందు తనకు గల అనురాగమును మొదట వెల్లడి చేయునది. ఆ సీను తమిళములో "ఎణ్ణెతేకిరసీను" (నూనె అంటు సీను) అని మద్రాసున ప్రసిద్ధి. ఆ నాటకము రోజున ఎవరి నోటబట్టిన అదే మాట. తార చంద్రునకు తలంటుచున్నట్లు చిత్రమును అచ్చొత్తించి ఊరంతయు పంచిపెట్టేవారు. దీనిని చూచుటకు జనులు తండోప తండములుగా వచ్చేవారు. ఈ ఊరిలో గొప్పగొప్పవారు సహితము ఈ సీను చూచుటకు హాజరయ్యేవారు.

## గోవిందసామి రావు కంపెని

వీరి పిమ్మట గోవిందసామిరావు అను బ్రాహ్మణుడు పోలీసు నౌకరిని వేసి వదలుకొని, నాటకరంగమున ప్రవేశించెను. ఈయన భారీమనిషి, బుర్ర మీసములు, దృఢకాయముగల అందగాడు. వీరి నాటకములకు మంచి ఆదరణ కలిగెను. వీరి నాటకములలో మంచి పేరుగాంచినది రామదాసు నాటకము. ఈ నాటకములో ముఖ్యపాత్రయగు నవాబు వేషమును గోవిందసామి రావుగారే ధరించేవారు. ఆ కాలమున ఈ నాటకములో వీరు చూపిన వేష భాషలు ఇంకను నాకు మరుపురాలేదు. ఉరుదు భాషను చక్కగ ఉచ్చరింప గలిగినవారానవాబు వేషమునకు చక్కగా అతికినట్లుండేవారు. చిన్నబాలురను రామలక్ష్మణుల పాత్రలు వహింప తర్ఫీదు నిప్పించి రంగస్థలమున ప్రదర్శించిరి. ఆ బాలురు కడుశ్రావ్యముగా పాడేవారు. ఆ రోజులలో పురుషుడే బూబు వేషము వేసేవాడు. కొజాస్త్రీల వేషములు ధరించినవారు రంగస్థలమున నాట్యము చేసేవారు.

## మరొక్క తమిళ నాటకము

మరియొక్క తమిళ నాటకములో నేను చూచిన దృశ్యమును కూడ ఇక్కడ వ్రాయకతప్పదు. హరిశ్చంద్ర నాటకములో - ఇరువురు కాటికాపరుల వేషమును ధరించుకొని రాగా, ఎవరి వేషము బాగున్నదో దానిని జడ్జీలు నిర్ణయించి బహుమతి యొసంగవలయునని ఏర్పాటాయెను. ఈ విషయమును కరపత్రముల ద్వారా ఊరంతయు వెల్లడిపరచిరి. ఆ దినమున టిక్కట్లు దొరుకుట కష్టమాయెను. అదుపాజ్ఞలు చేయ పోలీసులు కూడ రావలసివచ్చెను.

కొంతకాలమునకు తెర తీసిరి. స్మశానదృశ్యము కనుపడెను. అక్కడ కండ్లు తుడుచుకుంటూ చంద్రమతి సకలాలంకారభూషణ భూషితురాలై పెద్ద పెండ్లికూతురివలె అగుపడెను. ఆమె కిరువంకల పందెమును వేసుకొన్న కాటి కాపరి వేషధారులు ఇరువురును నిలవబడియుండిరి. వారు మంచి సరిగె ఉడుపులను, వెలగల ఆభరణములను ధరించుకొని, వెండికఱ్ఱలను చేతపట్టుకొని యుండిరి. అప్పుడు అక్కడ ఏర్పాటైన జడ్జీలు ఇరువురును వారిరువురిని ముందుకు రమ్మని వార్లను ఎగాదిగా చూచి, మెడలో అధికముగా బంగారుహారములు ధరించిన వేషధారికి బహుమతి నొసంగిరి. ఇదీ ఆ కాలమున మద్రాసులో తమిళుల హరిశ్చంద్ర నాటకవిశేషము.

# 23 నెల్లూరి నాటక సమాజములు

## నెల్లూరి వర్ధమాన సమాజము

నాకు తెలిసినప్పటినుండియు ఈ సమాజమునకు (దీనిని తెలుగులో నెల్లూరు వర్ధమాన సమాజము అని 1906 నుండి పిలిచేవారు.) ముఖ్యపురుషులు శ్రీమాన్ కే.ఏ. వీర రాఘవాచార్యులుగారు. ఈ సమాజమునకు వీరు తండ్రివలె నుండేవారు. వీరు జీవించి యున్నంతకాలము సమాజమున నాటకముల శాఖ జీవముతోనుండెను. అప్పుడీ సమాజపు నాటకములశాఖ నలంకరించుచుండినవారిలో శ్రీ కానుఖేల కపాలి రామచంద్రరావుగారు, వరదాచారిగారు, ముంగమూరి వెంకటసుబ్బారావుగారు, నందగిరి హనుమంతరావుగారు, రామానుజాచారిగారు, వవ్వేటి విశ్వనాథరావుగారు, సింగరాచార్యులుగారు, ముత్తరాజు శివకామయ్యగారు మున్నగువారు నాకు బాగుగ జ్ఞాపకమున్నవారు.

వీరందరు ఉద్యోగస్థులు ; పెద్ద మనుష్యులు. చక్కని నటులు. అయితే నాటకములు వేయవలెననే కుతూహలమున్నంతగా అందుకు తయారు కావలయు

వనే శ్రద్ధయుండెడిది కాదు. వీరికి ఆంధ్రభాషాభిమాని సమాజమునకు వలె గురుత్వముతో శిక్షించి ఒద్దికల దిద్దగల వెంకటరాయశాస్త్రిగారివంటి ప్రతిభాశాలురు లేరు. అట్టి శిక్షణ మిచ్చగింపక సమాజమునకే ముప్పుదెచ్చుకొన్న అమెచ్యూర్సు నాటక సంఘమువారును వీరిలో కొందరున్నారు. పోనీ వీరిలో వీరైన నొకరి కొకరు శిక్షణ నిచ్చుటలేదు. వీరందరును పెద్దలగుటచే అది నాజూకు కాదని వీరి అభిప్రాయము. అందుచే సామాన్యముగా వీరు నాటకమెప్పుడు వేసినను, ఎవరును, తమ పార్టునైనను పూర్తిగా చదివి కంఠస్థము చేసుకొనేవారు కారు. కేవలము తెర వెనుకనుండి అందిచ్చు (Prompter) సాహాయ్యముననే నాటకము సాగించేవారు. ఒక్కొక్కప్పుడు కొన్ని విచిత్రములును జరుగుచుండేవి. తెర వెనుకనుండి చెప్పువాని మాటలు కుర్చీలపై కూర్చున్నవారికి తరచుగా వినిపించుచుండేవి.

చిత్రనళీయములో దమయంతిని నలుడు విడిచి వెళ్ళినతర్వాత, ఆమె అడవిలో పోవుచుండగా నొక ఋష్యాశ్రమము కన్పించును. అందున్న ఋషులలో నొక్కరు ఆమె కథనంతా విని సానుతాపమున నొకపద్యము చదువును.

"హరీ హరీ [అని చెవులు మూసుకొని]"

ఇందు "చెవులుమూసుకొని" అనునది పాత్రధారికి సూచన ; ఇది నటించవలసినదేగాని వచింపవలసినదికాదు. అయితే ఈ వేషము వేసిన మా మిత్రులు కీ.శే. నేలటూరి శింగరాచార్యులుగారు (వీరు వెంకటగిరిరాజాగారి హైస్కూలులో పైతరగతుల కుపాధ్యాయులు)- "హరి హరీ" తోపాటు ఆ "చెవులుమూసుకొని" అనేది కూడ తెరవెనుక నుండి అందుకొని - పద్యములో కలిపివేసి, రాగయుక్తముగా చదివి వైచిరట. ఆ నాటకము నెన్నోసార్లు చదివిన, చూచిన, ప్రేక్షకులు - చప్పట్లు చరిచి గల్లంతు చేసిరట.

శ్రీ నందగిరి హనుమంతరావుగా రొకసారి ప్రమీలార్జునీయమున ప్రమీలా పాత్రను నటించిరి. వేషమున పెద్దపావడా ధరించిరి. ఆ పావడా సింహాసనమునంతయు కప్పియున్నందున దాని క్రిందచేరి యొకడు 'పార్టు' నందించుచుండెను. కాని ఎంతకాలము అతడట్లు కూర్చుండగలడు ? ఆ రంగమున చెప్పవలసినదంతయు కాగానే తెర పడు వరకు ఓపిక పట్టజాలక అతడు ఇవతలికి వచ్చి లోనికి పారిపోయినాడు. సభాసదులందరును గొల్లుననవ్విరి.

అయితే వీరి వేషభాషలు తక్కువైనవి కావు. ఇప్పుడు రామచంద్రరావుగారిని చూచినవారికి ఆశ్చర్యము గొల్పవచ్చును. ఆ రోజులలో వారి రాజ

వేషము రాజఠీవితో నొప్పెడిది. ఆ మూర్తి నాకింకను కళ్లలోమెదులుచున్నది. శ్రీ నందగిరి హనుమంతరావుగారు స్త్రీవేషమున 'స్త్రీయేనా' అని భ్రమింపజేసే వారు. ఇరువురు చక్కగా పాడనేర్చినవారు. అయితే ఉన్నలోపము పైన వివరించేయున్నాను. రానురాను వీరు నాటకములాడుట మందగించినది. కాని దసరా ఉత్సవములలో - లఘు ప్రదర్శనములు, ప్రహసనములు మాత్రము వేయుచుండిరి. అందు ముఖ్యముగా నాటకములకు సంబంధించినంత వరకు 'టాబ్లో' (Tableau) అనే పాశ్చాత్యపద్ధతి ననుసరించి ఒక్కొక్క ఘట్టమును ప్రదర్శించేవారు. అనగా ఆ ఘట్టమున కవసరమైన - (విశ్వామిత్రునకు హరి శ్చంద్రుడు రాజ్యమునొసంగుట, దమయంతిని నలుడువిడిచిచనుట, ఇత్యాదులు) వేషముల ధరించుకొని ఆయా అభినయమున కదలక మెదలక రంగమున నిల్చియుండేవారు. అందు కనుగుణమైన పద్యమో, పాటయో తెరలోనుండి యొకడు శ్రావ్యముగ విన్పించేవాడు. నటులకు వెనుక రంగులసీమను ; ముందు దోమ తెర వంటి కర్టన్. అనుగుణమైన దీపముల యేర్పాటు ఎంతో రమ్య ముగ నుండెడిది. అందు సహజముగా సుందరవిగ్రహములుగల నీ నటులు, తగు వేషములు వేసుకొన్నప్పుడు ఎంతో ఒప్పియుండేవారు.

వర్ధమానసమాజమువారు నాటకములు వేయురాత్రి నేను మద్రాసునుండి వారికి కావలసినవస్తువులను తీసుకొని పోవుచుండేవాడను. నాటికినేటికి నేనీ సమాజమున సభ్యుడనే. అయితే నా కారువారైన నా మిత్రులు చాలమంది గతించినారు. కావున ప్రత్యక్ష సంపర్కము చాలవరకు మందిగించినది.

ఈ సమాజమువారు తిక్కన పఠనమందిరము నొకటిని, పుస్తకభాండా రము నొకటిని నడుపుచున్నారని ఇదివరకే వ్రాసియున్నాను. దానిలోనే యొక శాఖను కీ.శే. వేదము వేంకట్రాయశాస్త్రిగారి పేర నొక గ్రంధాలయముగ నేర్పరచియున్నారు. ఈ సమాజము తరఫున చిరకాలమునుండి ఏటేటా తిక్కన జయంత్యుత్సవమును చాల వైభవముగ జరుపుచున్నారు. ఇటీవల కొన్నాళ్లగా శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారీ యుత్సవ నిర్వహణ భారము వహించి - ఆంధ్రదేశమందలి విద్వత్కవులను ధనరూపమున సత్కరించుచు - ఆంధ్ర కవితాదేవి నారాధించుచున్నారు. వీరే శ్రీ వేదము వేంకట్రాయశాస్త్రిగారి వర్ధంతియు ఏటేటా జరుపుచున్నారు. నేను ఈ సమాజపక్షముననే నెల్లూరున మొల్ల జయంతుల జరిపించి, ఆ సందర్భముననే, గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము నారంభించితిని. వ్యాసరచనపోటీ పతకముల నిచ్చియుంటిని. పిదప నిచ్చట చెన్నపురిలో మాయింటనే ఆ యుత్సవముల గావించుచున్నాను.

# ఆంధ్రభాషాభిమాని సమాజము

వర్ధమాన సమాజమును గూర్చి వ్రాయుచు దాని తొల్లింటి రూపము 'ఆమెచూర్స్ నాటక సంఘము' అనియు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు 1897 లో వ్రాసిన ప్రతాపరుద్రీయనాటకము నొకసారి ప్రదర్శించి విఫలులై, తిరిగీ స్వతంత్రముగా తర్ఫీదై ప్రదర్శింతమా, శాస్త్రిగారిచే తర్ఫీదై ప్రదర్శింతమా అన్న వాదవివాదములతో, ఆ సమాజమున చీలిక లేర్పడి, శాస్త్రిగారి శిష్యత్వము కోరినవారు వేరై - 'ఆంధ్రభాషాభిమాని సమాజము' గా నేర్పడిరి - అని వ్రాసియున్నాను.

శ్రీ శాస్త్రిగారి తర్ఫీదును కొందరు కోరుటలో అర్థము లేకపోలేదు. ఆయన గొప్పపండితులు, కవులునే గాక గొప్ప ఉపాధ్యాయులు. ఆంగ్ల నాటకముల సాంప్రదాయముల నెరింగినవారు. కావున రంగస్థల నిర్వహణ మర్మములన్నియు తెలిసినవారు. ఆయన క్రిస్టియన్ కాలేజీలో సంస్కృతాధ్యాపకులుగా చేరిన పిదప ప్రతిసంవత్సరమును ఏదోనొక సంస్కృత నాటకమును వారికి బోధింపవలసి యుండెను. ఆ బోధించుటతో వీరు తృప్తి పడక, తమ శిష్యులలో చురుకైనవారి నేరి వారివారికి తగిన పాత్రల నొసంగి నాటకమును నేర్పేవారు. భవభూతికృత 'ఉత్తరరామచరితము' అను నాటకము, కేవలము చదివి ఆనందించవలసినదేగాని ఆడి, చూడదగినదికాదని పలువురి అభిప్రాయము. అందుచే ఎల్లరు దానివంక చూడక వదలివేసిరి. అట్టిదాని నొకసారి శ్రీశాస్త్రులవారు తమశిష్యులకు నేర్పి ప్రదర్శింపించి అందరిచే మెప్పు బడసిరి. నెల్లూరు చెన్నపట్నమునకు సమీపమగుటచేతను, అప్పటికి నెల్లూరున కాలేజి లేకపోవుట చేతను నెల్లూరి విద్యార్థులు ఎఫ్.ఏ.బి.ఏలు చదువుటకు మద్రాసు వచ్చుచుండిరి. శ్రీ శాస్త్రులవారు క్రిస్టియన్ కాలేజీలో చేరిన సంవత్సరమే వారివద చదివినవారిలో శ్రీ వంగోలు వెంకట రంగయ్యగారు ఒకరు. ఇంకను యరగుడిపాటి వెంకటచలం పంతులు, మైదవోలు చంగయ్య పంతులు, కందాడై శ్రీనివాసన్ మొదలైనవారంతా వారివద్ద చదివినవారే ఆయా కారణములచే శ్రీ శాస్త్రిగారివద్ద తర్ఫీదై - దుర్ఘటమైన ఈ నాటకమాడి మెప్పింప వలయునని కొందరు నెల్లూరి యువకులకు పట్టుదల కలుగుటలో ఆశ్చర్యము లేదు. ఈ చీలికలు, కోరికలు గమనించిన పూండ్ల రామకృష్ణయ్యగారి ప్రోత్సాహమున 30-4-1889 తేదిన "ఆంధ్రభాషాభిమాని సమాజము" 13 గురితో నేర్పాటైనది.

దీనికి శ్రీ శాస్త్రిగారే శాశ్వతాధ్యక్షులు. శాస్త్రులవారి నాటకములు తప్ప ఇతర నాటకము లాడరాదు ; శాస్త్రులవారి వద్ద శిక్షణపొంది వారి అనుమతిపై గాని నాటకము వేయరాదు - అని నియమము లేర్పరచుకొనిరి.

అమెచ్యూర్సులో కలిగిన చీలికలు కొంతవరకు నెల్లూరిలో అశాంతి కలించెనన వచ్చును. అంతవరకు కలిసి మెలసి యున్న మిత్రులు, బంధువులు విడిబడి చెరియొక సమాజమునకు చెందిరి. శ్రీ కేశవాచార్యులు, శ్రీనివాసన్ గార్లు సోదరులు ; ఇరువురు బి.ఏ. లు. ఇరువురు అమెచ్యూర్సునందుండిరి. అన్న అందే నిల్చిపోయెను. తమ్ముడు ఆంధ్ర భాషాభిమాని సమాజమున చేరెను. క్రమముగ అమెచ్యూర్సనందు హేళనభావమును, ఆంధ్రభాషాభిమాని సమాజమున అభిమానమును హెచ్చసాగినవి. అసలు వారిలో కన్నను వారివారి యందు అభిమాన దురభిమానములు గలవారిలో తగవులు హెచ్చు. బహుశా ఈ తగవుల ఫలితమేమో - 1906 లో అమెచ్యూర్సువారి నాటకపు కొఠాయి తగులబడి పోవుటకు కారణము ? ఈ నాటకపు పాకలు తగులబడుట నెల్లూరు ననే కాదు. ఆ రోజులలో - బళ్లారిలోను సరసవినోదినీ సభవారి పాకయు తగులబడిపోయింది. రాజమహేంద్రవరమున శ్రీ కృత్తివెంటి నాగేశ్వరరావు గారి పాకయు తగులబడిపోయినది. ఈ రోజులలో ఎలక్షనులవలె ఆ రోజులలో నాటకసమాజములు కక్షలకు, తగవులకు ప్రధాన రంగములు.

శ్రీ శాస్త్రులవారి యాజమాన్యమున ఆంధ్రభాషాభిమాని సమాజము దినదిన ప్రవర్ధమానమై చిరకాలము నడచినది. 1925 లో రత్నావళీనాటకముతో సరి, మరి నాటకము వేయలేదు.

శాస్త్రులవారు శిక్షించుటలో చండశాసనులు. ఒక్కవ్యాకము మరువరాదు ; ఒకమాట పొల్లు పోరాదు ; అభినయమున నొక్క పొరపాటు రారాదు. ఒక్కసారి నటి - ఉషలో నొక పద్యభాగమును విడువగా నా రోజున నాటకము నాపుచేయుటకే ప్రయత్నించిరట. ఖైదుచేయబడి విరహావస్థలోనున్న అనిరుద్ధుని రొమ్ముపై వ్రాలునట్లుగా 'ఉషను' చిలుకను గావించి చిత్రలేఖ విసరుట కథపట్టు. కాకితపు చిలుకనైనను జాగ్రత్తగా అనిరుద్ధుని రొమ్ముపై బడునట్లే విసరగల్గుట శాస్త్రిగారి శిక్షణ ప్రభావమే. ప్రతాపరుద్రీయములో పిచ్చివానికెన్నో పిచ్చిపాటలున్నవి. వానిలో అర్థరహితమైనను ఒక్కఅక్షరములో — "గ్యం బ్యం గ్యం బ్యం గ్యం బ్యం ...." అను దానిలో సహా వదలరాదు. విద్యావంతుడు గాకున్నను, చక్కని శరీరము, శారీరముగల మధ్వరాయని విద్యానాథునిగా తీర్చిదిద్దిన వారి ప్రతిభ అద్భుతము. కొండగుంట వేంకటరమణశాస్త్రిగారిని పేరిగాని వేషానికి తయారుగావించుటయు వారి శక్తిసామర్థ్యమున ఫలమే. (ఇంకా వుంది

*Travelogue*

# A Week in Kerala

*Monday - August 10, 1988*

Soon after breakfast, we got into the vehicle - our destination being Kanya Kumari, the southern tip of our motherland. As we were passing thro' the main road of a small town, Driver Sasi said, "Balaramapuram."

"Oh, Balaramapuram, quite famous for its pattu (silk)," remarked Malati.

"How do you know that?" questioned Siva Swamy.

"Naa Partha Sarathy, in his award-winning novel 'Samudaya Veethi,' mentions of a lady wearing Balaramapuram pattu. That is how I have to come to know that this place is famous for silk-weaving," explained Malati.

"I have read her Telugu translation, 'Samajapu Korallo', brought out by the Sahitya Akademi. It was very interesting and I liked it immensely. Swami, you should read it," supplemented Radha.

Our next halt was at Padmanabhapuram - a fort and a pagoda - like palace. We drove straight to the palace and to our ill-luck, it happened to be a weekly holiday for them. As the main gate was kept open, we could gain access into the compound and satisfy ourselves gazing at the outer walls of the palace. Later we soaked our disappointment in the tender coconut water from a nearby shop and were on road again.

On National Highway No. 47, our next stop was at Suchindrum. According to the story of Anasuya, the wife of Sage Atri, the trinity of Brahma Vishnu Maheswara is here. Indra comes to this place every night to offer midnight prayers to atone the sin of his misbehaviour with Ahalya. While Parvati, the consort of Siva, was meditating at the edge of the land (Kanya Kumari) for the grace of her lord, the intervention of Narada for a higher objective of killing Banasura, kept the divine couple apart. At the auspicious moment when the marriage ceremony was to take place, Siva was purposefully detained at Suchindrum and Kanya remained a virgin

forever. Historically, they say, the story related to Parashakti, the daughter of a Pandian king but assumed legendary importance. The statue of Anjaneya, carved out of a polished stone is about 18 feet and odd and Hanuman is at his tallest in Suchindrum. It was lying buried since 1740 and only in 1929 Chitra Thirunal Maharaja of Travancore brought it out and got it embellished and installed it in the present imposing posture. Nataka Sala in the temple was built by Devadasis during the years 1787-1819. Kulasekhara, Alankara, Vira Pandiyan, Udaya Marthanda, Rishabha, Oonchal, Vasanta - so many Mandapas are there, besides musical pillars - twentyfour in one cluster and thirtythree in another cluster. Suchindrum is an example of South Indian Temple Craft and Architecture.

For the information of my young friend Ram Gopal, I might say that I had not the good fortune of entering this temple or the one at Kanya Kumari, where bare-chested Europeans sporting glass-beads went in and laughingly came out, as the gateman at both places barred my entry with my shirt on. Of course, that mattered very little to me - I could feel the breeze.

Within ten or fifteen minutes of our leaving Kovalam, we had entered the Tamil Nadu State. Both Suchindrum and Padmanabhapuram are in Tamil Nadu. We were actually in the Kanya Kumari district that has an area of 1700 sq km and a population of about 15 lakh or so - the smallest district in the State. Nagerkoil is the district headquarters where there is a transmitting station of the All India Radio. Anjaneyulu, our good friend at Madras, was the station director and we straight walked into his room giving him a pleasant surprise. He was so happy seeing us - friends who brought to him the memories of the Marina and the blue sea visible from the Madras AIR Station. He took us to his residential quarters and asked us to stay away for lunch but we apologised explaining to him how we were already late and behind the schedule by two hours or even more. After tea and biscuits, we were again on the highway. Our rooms were booked at the Tamil Nadu Guest House.

Without any rest or relaxation after lunch, we

moved on to Kanya Kumari temple and therefrom to the Vivekananda Rock Memorial. In 1892 Swami Vivekananda swam over a distance of 450 yards to reach this rock and sat there in meditation for three days and nights and after that, realisation and enlightenment came over him and he could clearly perceive the mission of his life. About three decades later, Gandhiji's Anaasakta Yoga was at the foot of the Himalayas. Born in 1863, a brilliant post-graduate of the Calcutta University and an ardent seeker of scientific truth, Vivekananda came under the spell of Ramakrishna Paramahamsa and found an answer to his scorching doubts and searching questions. Swami Vivekananda, who passed away in 1902 at the age of 40, worked vigorously for ten years to spread his message. From Kanya Kumari he came to Madras and friends here at Madras financed his trip to the United States of America. His address at the World Parliament of Religions, Chicago, vibrated /with life and vigour. Even today those resounding words give hope and faith to different age-groups of men and women. Those dynamic words spur you to action and convince you that Hinduism is not just a creed or blind worship but an ever-expanding experience of humanistic approach to whatever that comes your way.

Every half-an-hour there is a boat and the actual journey-time does not take even five minutes. Vivekananda Memorial is a monument constructed in 1970 at a cost of one crore and ten lakh and the aftairs of this centre are managed by the Vivekananda Rock Memorial Committee. Inside the monument there is an elegant and exquisite bronze statue of Swami Vivekananda.

While standing on the Rock, with sea-waves lashing on all sides, you feel you are an island. Of course, in a way, every person is an island but as you stand there, you start looking within yourself - a sense of aloofness envelops you. We hoped to spend more time on the Rock but it was already nearing five - time for the last but one boat and you have to stand in a long winding queue. One thing that was most jarring to our ears was the recorded music at the Memorial. The

serenity of the place and the calmness of exhilarating atmosphere, should not be violated by this sort of noise. Sweet melodies are heard only in silence and as Carlyle puts it, "Silence is the element in which great things fashion themselves."

Gandhiji's ashes were immersed in the sacred waters of Kanya Kumari and in 1956, in deep reverence to the Father of the Nation, Gandhi Mandap was built. The extraordinary feature of this construction is on October 2, at noon-time, the sunlight falls on the pedestal, through a slit in the canopy.

While returning to the guest house, Malati said, "Eleven years back I was here. I came with a group of writers, about eighteen or so, - a tour organised by the Field Publicity Department of the Government of India. Rajam Krishnan also was with us. At that time it was not so ugly, so dirty and so bad. I longed to show this beautiful place to Chendur but now it is a thorough disappointment and disillusionment. Everything is so uncouth and unclean - what a drastic change in these ten years. The only thing I liked was that Veda Patta Sala - they are at least trying their best to keep up the thread of cultural heritage unbroken. May it flourish - that is my only prayer."

"In every sphere of life this downward trend is so evident," said Siva Swamy.

In the evening we hoped to see the sunset but the cluster of buildings that came up stood in the way of our witnessing that sight so much eulogised by writers and painters.

As Malati went to bed early, I was sitting in the balcony till late in the night watching the myriad lights and wondering why we have been losing our aesthetic and spiritual values at the altar of callousness and exploitation. It takes a thousand years for a Swami Vivekananda or a Mahatma Gandhi to be born again.

*Tuesday - August 02, 1988*

Unusually Siva Swamy woke up by five and we bid good-bye to Kanya Kumari by six. At some wayside hotel we had our early morning cup of coffee and proceeded to Trivandrum where we were to have breakfast at Kesavan's house, - Kesavan, a senior officer just like Siva Swamy. We met him at Quilon the

other day and Siva Swamy in his usual enthusiasm told him that we would have breakfast at his place on our return journey. On paper Siva Swamy's time-schedule appears perfect but in implementation it invariably falls behind schedule. "We leave Kanya Kumari by six. Reach Kesavan's place by 8-30. Breakfast 30 minutes. Leave by 9 or 9-15 and reach Ernakulam by 12-30. Then to Cochin Port where they expect us. I told them we are coming. Lunch with them Leave by 3 or 3-30. One full hour for packing the luggage. By 4-30 at station. Their train is at 5."

"Take it from me, we will reach Ernakulam by 3-30 or 4 and hurry up to the station, gathering whatever that is at hand and the rest to be fetched by me when I come to Madras next fortnight. Swamiji's calculations never work - I know for thirty years," said Radha emphatically.

It was a delightful dispute and a lively difference of opinion and such differences and divergencies render charm to the lives of modern couples.

Kesavan is well-acquainted with the modern Malayalam literature and we have common friends in Pavanan, George



etc. In subsquent conversation, names of Bala Mani, Sankara Kurup, Kamala Das, Kamala Markandeya, Vilasini and others came up. We regretted not having enough time to spend with Kesavan. In spite of Radha goading us, it was ten-thirty by the time we took leave of the Kesavan Couple who were so kind, friendly and hospitable.

"Next time you should plan your Kerala trip leisurely and spend at least a couple of days in Trivandrum meeting your literary friends. Then alone you will know the pulse of this area,'' said Kesavan, as we were leaving.

Of the fourteen districts in Kerala, we had a glimpse of just six: Ernakulam, Trichur, Palghat, Alleppey, Quilon and Trivandrum. Kerala has 41 west - flowing rivers and 5 east - flowing rivers with innumerable tributaries. Though rice is in short supply, there are plenty of coffee and tea plantations. 92% of India's rubber is produced here. Likewise, 70% of the nation's cordamom, 70% coconut, 60% arecanut, 70% pepper, 80% tapioca and 99% lemon-grass oil are from Kerala. That gives you an idea of Kerala's vast wealth and natural resources.

Driver Sasi has been asking us these three days that we should halt at least for ten minutes at his native village - just 2 km from the National Highway. We took a diversion by a kutcha road (kept in an excellent manner) winding our way thro' fields. In five minutes we were at his place. It was a nice, comfortable house on a sprawling farm, full of different kinds of trees, a well and a tank. Sankaracharya, due to social ostracism, had to cremate his mother in the backyard of their house. Since then the custom of cremating in the backyard has prevailed in rural Kerala. At the place of cremation a sapling is sown and when it grows into a tree that tree is held in high esteem as a mark of respect to the departed soul. Dr. Kesari mentions of this in his autobiography. In the interior of Kerala the houses are small and compact but in the frontyard, backyard and sideways, they grow plantain, coconut and other fruit - yielding trees besides a vegetable garden and a flower garden. It is an atmosphere where you live in harmony with nature.

Sasi's parents, wife, sister, children and other inmates were introduced to us. We were offered fruit, biscuits and tender coconut water. Those surroundings were of deep family ties governing the course of life Urbanisation has ruined the essential element of the Hindu family structure but in rural parts still the story is different.

It was nearing one as we came on to the National Highway and the buffaloes that were driven to slaughter houses covering a long distance by road, was a pathetic sight and a grim reminder of Man's utmost cruelty and utter brutality to animals in the land of Gautama Buddha who spread the gospel of kindness to all life. Only that great and noble lady Rukmini Arundale spoke vehemently in defence of these mute animal - citizens - she is no more. The inhuman plunder of our live-stock is in no way different from the slave-trade of the 18th century. It was Upton




క్రివేణి® ఇంకు
గమ్
ఆఫీసు పేస్టు
వాడి,
వాటి విశిష్టతను
గమనించండి.
kriveni
IS:1221-71
ISI
తయారుచేయువారు:
కృష్ణవేణి ఇంకు ఫ్యాక్టరీ
751, తిరువత్తియూర్ హై రోడ్, మద్రాసు-600 081




Sinclair that madethe Americans open their eyes to the horrors of tinned meat. In our country where twentytwo languages vie with one another as to the origin and ancestry, we have only political journalism but not live literature that could move the conscience of men and stir the public opinion to action.

By the time we reached Ernakulam, as Radha had said earlier, it was past three, Quick bath, change of clothes and packing up the luggage. By four-thirty we were at the station.

"All the three families have been waiting for you since twelve-thirty and we expected you all for lunch. Other friends also gatheeed. At three-thirty we gave up hope. I know you are leaving by this train. That's why I rushed. And in the hurry I lost my key-bunch. Doesn't matter. We shall break open our door with the help of neighbours. I would have wept bitterly, had I not reached station on time. Still some eight minutes are left. This is for you," said that young woman placing a brass *Kutti Vallaku* of about one-and-a feet or so in height, in the hands of Malati, while that lady's husband was holding their two-year-old baby in his arms. There were tears of joy on her face, as she gave that memento to Malati Chendur.

In that shower of affection and love, reflectd thro' glistening eyes, all the four of us were speechless but for a little mumbling of words and as the train was ready to start, we were pushed into the compartment.

The irony of it all - we do not know her name, nor her husband's name to send at least a formal letter of thanks. He was in the Cochin Port Trust - that's all, we knew.

That *Kutti Vallaku,* along with the rowing boat of the Cochin Andhra Association, stands in our show-case (a memento of fragrance and sweetness), as a constant reminder of that endearing young couple. How we wish we had known more of them !

*(Concluded)*

**— NR Chendur**



# కొత్త పుస్తకాలు

'వి జే త' - యన్.టి రామారావు జీవిత చిత్ర కథ - నాదెళ్ల ప్రత్యగాత్మ. ప్రచురణ : తెలుగు భారతి, హైదరాబాదు - మద్రాసు. వెల : రు 150-00

ప్రత్యగాత్మ పన్నెండేళ్ల నిర్విరామ కృషికి, సాధనకూ సాక్షీ భూతమైన ఈ 'పిక్టోరియల్ బయోగ్రఫీ' లో, 'మన దేశం' (1949) నుంచి 'బ్రహ్మర్షి విశ్వామిత్ర' దాకానే గాక, యన్.టి ఆర్ తలిదండ్రులు, కుటుంబ సభ్యులు, అవార్డులందుకున్న సందర్భాలు, ప్రముఖులతో గడిపిన సమయాలు, రాజకీయ జైత్రయాత్ర మున్నగు బొమ్మలున్నాయి. ఆబొమ్మలు తమ వెంట తెచ్చే స్మృతి మాల మనకు ఆహ్లాదం కలిగిస్తుంది. 'దాన వీర శూర కర్ణ'లో, కర్ణ, దుర్యోధన, శ్రీకృష్ణ పాత్రలు మూడూ తనే అయి మెప్పించిన రామారావు, 'శ్రీమద్ విరాటపర్వం' లో, శ్రీకృష్ణ, దుర్యోధన, కీచక, అర్జున, బృహన్నల పాత్రలు అయిదింటికీ జీవం పోశారు.

'పాతాళ భైరవి'లో తోటరాముడు, 'సాహసం సేయరా - రాకుమారి లభిస్తుంది' అని మాంత్రికుని ప్రబోధానికి, గిరగిరా తిరుగుతున్న కత్తుల చక్రంలో దూరి విజయం సాధించినట్లే, ఓటమి నెరుగని వీరుడాయన. 'మనలో మనకు విభేదాలు వుండవచ్చు ; కాని, మనందరం కలసికట్టుగా వుంటే తప్ప, కాంగ్రెస్‌ని వోడించగలగడం కల్ల'- అని ప్రతిపక్ష కూటమి నేర్పరిచిన రాజకీయనేత. మూడువందల చిత్రాల లోని విభిన్న పాత్రల నుంచి, విజ్ఞులైన మిత్రులనుంచి, జీవిత పాఠాలు నేర్చుకొని, ఆ నేర్చుకొన్న మంచినీ, మానవతనీ త్రికరణ శుద్ధిగా ఆచరణలో పెట్టారు.

ఈ పుస్తకంలోని ప్రతి బొమ్మ ఒక కథ చెబుతుంది ; ఒక కావ్యమల్లుతుంది. జీవిత కథని మాటలలో గాక, మరుపు రాని బొమ్మలలో వర్ణిస్తుంది.

✠ ✠ ✠

'మధ్యనొచ్చిన మనిషి మరికొన్ని కథలు' (ఇంగ్లీషులో). రచయిత్రి : భారతీ ముఖర్జీ. ప్రచురణ : ప్రెంటిస్ హాల్ ఆఫ్ ఇండియా ప్రవేట్ లిమిటెడ్, న్యూఢిల్లీ - 110 001 వెల : రు 39-00.

The Middleman and other Stories by Bharati Mukherjee. Published by Prentice - Hall of India Private Ltd., New Delhi - 110 001. Price : Rs. 39-00.

తన మీాదనున్న వారంట్ తప్పించుకునేందుకు ఆల్ ఫ్రెడ్, ప్రెసిడెంట్ గుటిరెజ్ పాలిస్తున్న ప్రాంతంలోకి పారిపోతాడు. రాన్సమ్ అతనికి ఆశ్రయమిస్తాడు. ఈ రాన్సమ్ వుంపుడు కత్తె మేరియా, గుటిరెజ్‌కి రహస్యంగా ఆయుధాలు జేరవేసే తదంగంలో, ఈ అల్‌ఫ్రెడ్‌ని యిరికిస్తుంది - వలపు చూపులతో అతనిని కట్టివేస్తూ! అసలీ మేరియా ఎవరు? కాన్వెంట్‌లో చదువుకుంటున్న పదిహేడేళ్ల యువతిని, గుటిరెజ్ ఎత్తుకొచ్చి, తన సొత్తుగా చేసుకు, ఆ పైన కొన్నాళ్లకి రాన్సమ్‌కి వొప్పజెబుతాడు. నాట్యవిద్య నేర్చుకోవాలని కలలుగన్న ఈ మేరియా, తను యిరుక్కున్న వూబి నుంచి - దేశ విద్రోహకరమై చంపడమో చావడమో లాటి వూబి నుంచి - బయట పడలేదు సరికదా, స్నేహితునిగా చేరువకొచ్చిన ఆల్‌ఫ్రెడ్‌ని కూడా అందులో దింపుతుంది. మోసం చేయనున్నాడనే అనుమానంతో, గుటిరెజ్ మనుషులు రాన్సమ్‌ని దారుణంగా కాల్చి చంపుతారు. "ఆల్ఫీ, ఏవో ఆశయాలకోసం విప్లవాలు జరుగుతాయనుకుంటారు - అంతా పవర్‌గేమ్ - ఎవరు అధికులమనే పోటీపందెం. రాన్సమ్ రాలిపోక తప్పదు - గుటిరెజ్ విప్లవాధినేత కావచ్చు, లేదా, ఈ అడవులలో అనామకంగా నశించిపోవచ్చు, వారిద్దరినీ నేను ఎదిరించలేను - వారి పాపాలలో నావంతు భాగం పంచుకోక తప్పలేదు. కాని, నీవంటే యిష్టపడి లోబడ్డాను," అంటూ అంత ఆప్యాయత వొలకబోసిన మేరియా, మర్నాడు కనిపించదు; మరొక ప్రియునితో మాయమవుతుంది.

ఇమ్రి, లెబనాన్‌కి వెందుతాడో, ఆఫ్ఘనిస్తాన్‌కి వెందుతాడో ఆమెకి స్పష్టంగా తెలియదు. అప్పుడప్పుడు సాయంత్రం వేళ థియేటర్‌కి తీసుకు వెళ్తాడు. ఒక్కోసారి అతను తన చేతిని తాకబోతే, తను వెంటనే లాగేసుకుంటుంది. అతను తన మొహంలోకి చూసి నవ్వుతాడు - తనూ నవ్వుతుంది. స్టేట్స్ వచ్చి ఆరునెలలయింది; ఇంకో ఏడాదిన్నర గడిస్తే గాని చదువు పూర్తి కాదు .... రూమ్‌మేట్ భార్లిఛిన్ తన మొదటి భర్త ఎర్రాతో విడిపోయినప్పటికీ అతను అప్పుడప్పుడొచ్చి భార్లిఛిన్‌ని పలకరించి వెళ్తూవుంటారు. విడాకులు తీసుకున్న మీాదట కూడా, మాటలు వుంటాయా? - అని తనకు ఆశ్చర్యంగా ఉంటుంది. భార్లిఛిన్ రజనీష్ భక్తురాలు. భట్ (భర్త) అమెరికా వస్తున్నాడని చెప్పేసరికి, రూమంతా తనకి వొదిలేసి, పదిహేను రోజుల పాటు కాంపుకి వెళ్లింది భార్లిఛిన్. భర్త వచ్చాక, ఆ పదిరోజులూ అతనితో, అత్తవారింట్లో సాధ్యంగాని రీతిని, నిర్లజ్జతో గడిపి, నిలువుటద్దంలో తన రూపు చూసుకు, వింత సంతోషం పొందుతుందామె.

'ఆర్బిటింగ్' అనే కథానికలో ఇటాలియన్ తండ్రి, తన కూతురితో అంటాడు: 'మగవానికి ఒక ఆఫీసంటూ వుండాలి. పొద్దుటే వెళ్లి, చీకటి పడేవేళకి యిలుచేరుకోవాలి - అని

మీ అమ్మ అంటూండేది. ఆ ప్రకారమే చేశాను ముప్ఫయ్యేనిమిదేళ్లు! అదే కథానికలో వారి ఫామిలీ ఫ్రెండ్ అబ్దుల్లా అంటాడు: 'మీరు తాగితే నాకభ్యంతరం లేదు. కాని, నేను మాత్రం మద్యం ముట్టను'

ఇండియాలో భర్తలు భార్యలని కొడతారనీ, హింసిస్తారనీ ఒక దురభిప్రాయం ఏర్పరుచుకున్న ప్రొఫెసర్ మాయా సన్యాల్, ఒంటరిగా వుండిపోగా, చటర్జీ దంపతులు ఆమెని ఒక గృహిణిగా చేసేందుకు కంకణం కట్టుకుంటారు. ఫలానా వారి అబ్బాయి నీగ్రో ముస్లిమ్‌ని చేసుకోనున్నాడనీ, అయోవాలో ఒక సద్బ్రాహ్మణ యువకుడు ఆఫ్రికన్ ముస్లిమ్‌ని కట్టుకున్నాడనీ - యిటువంటి పెళ్లిమాటలే అధికంగా వినిపిస్తాయి వారింట్లో. కాలి వేళ్లతో సిగరెట్ ముట్టించే ఫ్రెడ్, అశోక మెహతాకి, మాయాసన్యాల్‌కి మంతనం ఏర్పరుస్తాడు.

ఈ సంపుటిలో మొత్తం పదకొండు కథలు వున్నాయి, అన్నిటిలోకీ తలమానికమనదగినది, 'జాస్మిన్' అనే కథానిక. ట్రినిడాడ్‌లోని 'పోర్ట్ ఆఫ్ స్పెయిన్' నుంచి కెనడా మీదుగా డెట్రాయిట్‌కొచ్చిన జాస్మిన్ (పంజాబీ) వద్ద ఇమిగ్రేషన్ పత్రాలు వుండవు. కష్టాల కడలిని ఆమె ఎంతో నేర్పుగా ఈదుకొచ్చి, తన దారి తను తెలుసుకోగలుగుతుంది.

కలకత్తాలో జన్మించి, బరోడాలో ఎమ్ఎ చేసి, అమెరికాలోని అయొవా యూనివర్సిటీలో పిహెచ్‌డి తీసుకు, ప్రస్తుతం కొలంబియా యూనివర్సిటీలోను, న్యూయార్క్ సిటీ యూనివర్సిటీలోను సృజనాత్మక రచన (Creative Writing) అనే అంశం బోధిస్తున్న భారతీ ముఖర్జీ, అమెరికాలోని 'ఇమిగ్రెంట్స్'కి సంబంధించిన సాహిత్యంలో ప్రముఖులు - అనేక అవార్డులు పొందారు. పాతికేళ్లుగా అమెరికాలో ఉంటున్నారు. ఆసియా, పశ్చిమా


రుచిలో నెం.1
క్రేన్ వక్కపొడి
దక్షిణ భారతదేశపు నెం.1 వక్కపొడి
CRANE
CRANE

యా, దక్షిణ అమెరికాల నుంచి వచ్చి, స్థిరపడిన వారు, విభిన్న సంస్కృతీ ప్రవాహాలలో ఎలా పయనించేదీ ఈమె కథలు చెబుతాయి. ఆచారాలూ, అలవాట్లూ ఘర్షణ పడుతూ రాజీకి వస్తాయి. ఆ సంస్కృతీ సంగమం ఈమె కథలలో కనిపిస్తుంది. ఫిలిప్పీన్ యువతి అట్లాంటా షైనా షర్ని ఆకట్టుకోవడం, సిమ్లా నుంచి వెళ్లిన డోగ్రా యువకుడు తన భాగ్యరేఖ మారనున్నదని భ్రమించడం, ప్రతి చేపకీ ఒక జాలరీ ప్రతి లేడికీ ఒక వేటగాడు నిత్య సత్యాలనే రంగనాథన్ ఈమె కథలలో కనిపిస్తారు. శ్రీలంక గురించి మనం తెలుసుకొనే కిలో సమాచారానికి సరితూగుతుంది ఆమె 'బరీడ్ లైట్స్' కథానిక ఒక్కటీ. అమెరికా భూతల స్వర్గం కాదు - ఇమిగ్రెంట్స్ ఆ సంస్కృతిలో యిమిడిపోవటం నేర్చుకోవాలి - అంటారు భారతీ ముఖర్జీ.

—క్షీరసాగరమ్

**ఈ మధ్య అందినవి :**

బాలల విజ్ఞాన సర్వస్వం - సంస్కృతి విభాగం. సంపాదకులు : బుడ్డిగ సుబ్బరాయన్. అభినందన పబ్లిషర్స్, 28-10-1 కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ - 2. వెల : రు 150-00.

సోమన శతకం - చీమల కొండ సోమేశ్వరరావు, 11 బి - సిజిఇ కాలనీ, కుప్పమ్ బీచ్ రోడ్, మద్రాసు - 41.


మాలతీ చందూర్

నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16-50 |
| కాంచన మృగం | 16-50 |
| భూమి పుత్రి | 16-00 |
| మధుర స్మృతులు | 14-00 |
| ఓ మనిషి కథ | 16-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| మనసులోని మనసు | 25-00 |
| ఆలోచించు | 9-00 |
| రాగరక్తిమ | 18-00 |
| మేఘాల మేలిముసుగు | 16-00 |
| కలల వెలుగు | 15-00 |
| బ్రతకనేర్చిన జాణ | 14-00 |
| జయలక్ష్మి | 20-00 |
| కృష్ణవేణి | 20-00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15-00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18-00 |
| సద్యోగం | 15-00 |
| | 14-00 |

ఇవిగాక

| | |
|---|---|
| వంటలు — పిండివంటలు | 40-00 |
| ప్రశ్నలు — జవాబులు | 15-00 |
| జాబులు — జవాబులు | 13-00 |
| అల్లికలు — కుట్లు | 30-00 |
| అందాలు — అలంకారాలు | 15-00 |
| మహిళలకు మధురజీవనం | 7-50 |
| దాంపత్య జీవితం | 12-50 |

క్వాలిటీ పబ్లిషర్స్

విజయవాడ - 2

సమీక్షలు

# చిత్రజగతి



మెట్రో వారి

## 'పగ'

### (Revenge)

మెట్రో ఫిలిమ్ కార్పొరేషన్ వారు విడుదల చేస్తున్న ఈ పిక్చర్లో, కథ నాయకపాత్ర, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమస్తం జాకీ ఛాన్ (Jackie Chan). కెమెరా మాత్రం ఛెన్-యుంగ్-షు (Chen Yung Shu) ; మ్యూజిక్ ఛెన్-హుసయ్-హు (Chen Husai Hui). 'జాకీ ఛాన్' చిత్రాలు ఎందువల్ల యింత ఆదరణ పొందుతున్నాయి; వాటిలో వున్న ప్రత్యేకత ఏమిటి; మెషిన్‌గన్‌ల కాలంలో ఈ కర్రసామూ, కత్తిసామూ, భుజబలానికీ గల స్థానమేమిటి? జాకీ ఛాన్ ఫైట్లూ స్టంటులూ ఎందుకని సినీ ప్రేక్షకులని రంజింప జేస్తున్నాయి?" - యిటువంటి ప్రశ్నలు కలగడం సహజం. వీరోచిత కార్యాలు చేసి కీర్తింపబడాలని, ఎదిగీ ఎదగని మనుషుల్లో వుండే నిద్రాణ వాంఛని తృప్తిపరుస్తుంది ఆ సాహసం. బాలకులైన బలరామకృష్ణులు కంసుని రాజ్యంలోకి వచ్చి మొదట చంపినది మల్లవీరుల్ని. మల్లయుద్ధం, సాము గరిడీలు, విలువిద్య - యివన్నీ తుపాకీ గుండు పుట్టక పూర్వానివి. ఇద్దరు రాకుమారులు ఒక సుందరాంగిని ప్రేమిస్తే, ఆ యిరువురూ కత్తియుద్ధం చేసి (డ్యుయల్), నెగ్గినవారు ఆమెని పెళ్లాడటం నిన్న మొన్నటిదాకా యూరప్‌లో చట్టసమ్మతమూ గౌరవ ప్రదమూను. కనీసం కత్తిసాములో కౌశలమూ నైపుణ్యమూ ఉంటాయి. పిస్తోళ్లు వచ్చాక కూడా ఆ 'డ్యుయల్' సంప్రదాయం మానుకోలేదు పాశ్చాత్యులు. ఇదంతా ఎందుకంటే, ప్రేమను మాననీయులు మహత్తర శక్తిగా భావిస్తే, సామాన్యులు పగని తమ కోపం చల్లారేందుకు పోషించారు. ఆ పగ తీర్చుకోవడాన్ని, ప్రతీకారాన్ని, తన శారీరక బలంతో, తాతగారి వద్ద నుంచి నేర్చుకున్న విద్యాపాటవంతో చూపుతాడు యిందులోని హీరో. వ్యాయామ విద్యలు నేర్పే ఒక పాఠశాల గురువు. ఈ జాకీని చేరదీసి, ప్రత్యర్థుల మీద పందాలు కాసి, నెగ్గుతాడు. జాకీకి విజయోత్సాహమే తప్ప, తనని ఈ గురువు ధనార్జనకు ఎలా వాడుకుంటున్నాడో గ్రహించడు - ఒక విధంగా మట్టిబుర్ర. శత్రువుల సంఖ్య పెరుగుతుంది. ఒకసారి అనుకోకుండా తాతగారు అటువైపు

వస్తాడు : జాకీ ఆయన కంటపడకుండా పారిపోతాడు : నష్టపోయిన గురువు తాతగారిని చంపిస్తాడు. ఆ చంపిన వ్యక్తిపై కసి తీర్చుకుంటాడు జాకీ. చిన్న పిల్లలని, చిన్న పిల్లల మనస్తత్వం గలవారినీ ఆనందపరిచే చిత్రమిది.... పి ఆర్ ఒ : టియమ్ రామన్.

బాలాజీ వెంకటరమణ

## 'పోలీసు ఇనస్పెక్టర్'

గ్లామర్ క్వీన్ రాధకు పోలీసు దుస్తులు సైతం వొంటికి పట్టుకు మరింత గ్లామరస్‌గా వుండే ఈ చిత్రంలో, షీలా (రాధ), మైకేల్ రాజా (విజయకాంత్) ఆటకట్టించేందుకు శపథం పడుతుంది. పోలీసు డిపార్టుమెంటులో ఆమె సబినస్పెక్టరో, సర్కిల్లో 'యస్పి'యో మనకు తెలీదు - స్థూలంగా పోలీ సాఫీసరు. స్వతహాగా మంచివాడై మందు ముట్టని మైకేల్ రాజా, దారిద్ర్య శక్తుల వలయంలో సంఘవిద్రోహ శక్తుల కారడివిలో బందీయై, పిక్‌పాకెట్ నుంచి స్మగ్లర్ కింగ్‌గా గ్రాడ్యుయేషన్ పొంది, దీన జన రక్షకునిగా పేదలని ఆదుకుంటూ వుంటాడు. ఒక మంత్రి గారి కొడుకు, ఒక పేదరాలి కూతురు పరస్పరం ప్రేమించుకున్నప్పుడు, ఆ అమ్మాయికి న్యాయం చేకూర్చేందుకు గాను మంత్రిగారి కొడుక్కి దేహశుద్ధి చేయవలసి వస్తుంది మైకేల్ రాజా. చావుదెబ్బలు తిన్న ఆ యువకుడే న్యాయస్థానంలో, తనని కొట్టి హాస్పిటల్‌లో చేర్పించినది పోలీసువారు అని చెప్పేసరికి షీలాకు మతిపోతుంది. సుస్పష్టమగు సాక్ష్యం తారుమారవడమూ, కాపాడిన పోలీసువారి మీదనే బురద చల్లడమూతో షీలాలో పట్టుదల మరింత అధికమవుతుంది. ఈ వంచనని, ఘాతుకత్వాన్ని మట్టుపెట్టాలి. తను అరెస్ట్ వారెంటుతో వచ్చేసరికి గేట్‌మాన్, తన యజమానియాంటిసిపేటరీ బెయిల్ చూపిస్తాడు ; సెర్చ్ వారంటుతో వచ్చేసరికి 'ప్రేమలేఖ' దొరుకుతుంది ; బేడీలు వేసి, జీప్‌లో వూరేగిస్తూ తీసుకెళ్లేసరికి, తను ఇల్లు చేరుకున్న కొద్ది నిముషాలలో 'బొకే'తో (పూలగుత్తి) 'హాపీ బర్త్‌డే' అంటూ ప్రత్యక్షమవుతాడు మైకేల్ రాజా. 'నల్లనివన్నీ నీళ్లు, తెల్లనివన్నీ పాలూ కాదు ; చుట్టూ అవినీతి, లంచగొండితనం విలయ తాండవం చేస్తున్నప్పుడు, మీరు నమ్ముకుంటున్న ఆ చట్టం మిమ్మల్ని నట్టేట ముంచుతుంది. కోర్టులూ శాసనాలు ఎప్పుడూ ధనికులకే గాని పేదలకి కాదు, పేదలకు రక్షణ నిచ్చేది నావంటివారే' - అని ధీరస్వాంతుడైన సినిమా హీరో చెబుతాడు. హీరోయిన్ షీలాలోని 'పొగరు' ప్రేమ దీపమయే లోపున న్యాయం కళ్లు తెరుస్తుంది; సత్యం జయిస్తుంది. వసంతకుమార్ మాటలు, రాజశ్రీ పాటలు, గంగై అమరన్ మ్యూజిక్. నిర్మాత : కె నారాయణ రెడ్డి .... పిఆర్ఒ : దేవానంద్.



జూలై 13, 1990

"చాలా కాలంగా 'యమ్మెస్'ని స్టేజి మీద చూడటమూ, టివిలో చూడటమూ తప్ప, ప్రత్యక్షంగా, యింత దగ్గిర్నుంచి చూసే అవకాశం, ఆమె సరసని కూచోగల అదృష్టం నాకింత వరకూ లభించలేదు. నాకు అటువంటి మహదవకాశం కలిగించినది మద్రాసు తెలుగు అకాడమీ. ఇది నాజీవితంలో మర్చిపోలేని పర్వదినం. జాతీయ సమైక్యతకు, అంతర్జాతీయ సుహృద్భావానికి, లలితకళలూ, సంగీతనాట్యాదులూ ఎంతో దోహదకారి అవుతాయి. ఈ 'అకాడమీ' చేస్తున్నకృషి, దేశదేశాలకు విస్తరించాలనీ, దేశ ప్రజల మధ్య ప్రపంచ పౌరుల మధ్య ఒక చక్కటి సేతువు కావాలనీ మనసారా అభిలషిస్తున్నాను." - అన్నారు. వియస్‌టి ఇండిస్ట్రీసూ లిమిటెడ్(VST Industries Ltd), మద్రాసు తెలుగు అకాడమీ సంయుక్తంగా, మ్యూజిక్ అకాడమీ హాలులో ఏర్పాటు చేసిన మూడు రోజుల సంగీత నాట్యోత్సవంలో, - ఈనాటి ఫంక్షన్‌కి ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ విదుషీమణి ప్రమీలా దండావతె (కేంద్రమంత్రి మధుదండావతె శ్రీమతి). ఈరోజు కార్యక్రమం అంజనీ బెనర్జీ భరత నాట్య ప్రదర్శనతో ప్రారంభమయింది. శివస్తోత్రానంతరం, త్యాగరాజు 'నీ మనసు - నీ సొగసు' తో ప్రేక్షకులని మెప్పించిన ఈమె, రవీంద్ర సంగీతాన్ని భరతనాట్యరీతులలో అభినయం చేసింది. తను మ్యూజిక్ సమకూర్చిన రెండు చిత్రాలలో, తన పాటలకు ఈమె నాట్యము వన్నె తెచ్చిందని ప్రశంసించారు 'అకాడమీ' అధ్యక్షులు బాలమురళీకృష్ణ .... మద్రాసు తెలుగు అకాడమీ యిన్నేళ్ళగా చేస్తున్న కృషిగురించి ప్రస్తావిస్తూ, "ఛెయిర్మాన్," అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు, కార్యవర్గమూ అంటూ మా పేర్లు ఎందరివో వుంటాయిగాని - వీటన్నిటికీ మూల విరాట్ టివికె శాస్త్రిగారు. ఎవరిని ఏ విధంగా కాంటాక్ట్‌చేసి, నాలుగైదు నెలలకొకసారి యిటువంటి బృహత్ కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించగలుగుతున్నారో, దగ్గిర్నుంచి చూస్తున్న మాకే ఆశ్చర్యంగా ఉంటుంది. ఆ ఆత్మ విశ్వాసమూ

అచంచల దీక్ష అనితర సాధ్యం.... మా శాస్త్రిగారు ఈ 'అకాడమీ' కృషిని ఖండాంతరాలకు కూడా విస్తరింప జేయగలరని ఆశిస్తున్నాను" - అన్నారు పసిడి మెరుంగుల బాలమురళీకృష్ణ .... యమ్మెస్ గోపాలకృష్ణన్ వయొలిన్, దాక్షిణాత్య సంగీతం పలుకుతున్నప్పుడు భక్తవత్సలం మృదంగం, సుబ్రహ్మణ్యం ఘటం ; హిందూస్థానిది పలుకుతున్నప్పుడు ఉస్తాద్ షఫాట్ అహమ్మద్ ఖాన్ తబలా. గంగా యమునల సంగమంలా గోపాల కృష్ణన్ వయొలిన్‌లో ఉత్తర దక్షిణాలు ఒకటై, సంగీతానికి దిక్కులూ ఎల్లలూ లేవనీ, అది ఏకధార అనీ నిరూపించాయి .... "1936లో సుబ్బలక్ష్మితో పరిచయం అయింది. కాని, నాలుగేళ్లు నన్ను దూరంగా అట్టే పెట్టి, 1940 జులై 10వ తేదీన వొప్పుకుంది. ఆలయంలో జరిగిన మా పెళ్లికి అయిన ఖర్చు నూటయాభై రూపాయిలు. ఇవ్వాళ పదమూడు కదా, మొన్న జులై 10వ తేదీకి, మావైవాహిక జీవితం గోల్డెన్ జుబిలీ జరుపుకుంది. ఏ కాలేజీకీ వెళ్లకుండా 'యమ్మెస్' పొందింది సుబ్బలక్ష్మి" - అన్నారు సదాశివమ్, తమ దంపతులకి జరిగిన సన్మానానికి హర్షం వెలిబుచ్చుతూ ! ఈ వేదికపై తమ వివాహ స్వర్ణోత్సవాన్ని, మద్రాసు తెలుగు అకాడమీ యింతటి అభిమానంతో, ఆప్యాయతతో జరిపించడం అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగిస్తోందన్నారాయన.... ఈ సంగీత నాట్యోత్సవాలలో రోజుకొక ప్రముఖ వ్యక్తిని సత్కరించడం ఆనవాయితీ. వేదికపై ఓబులరెడ్డి, బాలమురళీకృష్ణ, రవీ భూతలింగం, శ్రీకృష్ణ, యస్ జానకి, అంజలీదేవి ఆశీనులు కాగా, పద్మవిభూషణ్ సుబ్బలక్ష్మి, సదాశివమ్ దంపతులను ప్రత్యేకమైన కుర్చీలపై కూర్చుండబెట్టి, వేదోక్తంగా సద్బ్రాహ్మణ స్వస్తి వాచకంతో సన్మాన పురస్కారం జరిపించారు. పన్నీరు చల్లడం, చందన చర్చ, పూలదండలు, కొత్తబట్టలు, మంగళాక్షితలు - యిలాటివన్నీ అయాక స్వర్ణోత్సవ దంపతుల కంఠసీమను ఒకే పూలదండతో అలంకరింపజేశారు టివికె శాస్త్రి.... ఆ తర్వాత బేగమ్ పర్వీన్ సుల్తానా హిందూస్తానీ గాత్రం. నిండైన విగ్రహం, అందమైన రూపం, అణకువైన స్వభావం. ముందు వరసలో కూచున్న యమ్మెస్ సుబ్బలక్ష్మికి వందనమాచరించి, ఆపైన పాట ప్రారంభించింది పర్వీన్ సుల్తానా: ఆమె గాత్రంలోని 'సరిగమపదనిస' లు సరస్సులోని చిరు అలలు, నదీ ప్రవాహంలోని తరంగాలు, సాగరతీరంలో యిసుకని తాకి నురుగులు చిమ్మి వెనక్కిమళ్లే కెరటాలు. అది ఒక సంగీత ధార. సుడులు తిరుగుతుంది, సొగసుల్లు పోతుంది, పరవళ్లు తొక్కుతుంది. 'సంగీత మనగా చెవిని సోకినంత సేపూ సంతోష పెట్టడమే కాదు ఆ తర్వాతకూడా, మనసుని స్పందింపజేయాలి' - అంటాడు షెల్లి, ఒకసారి విన్నవారు, తలుచుకు విస్మయానంద

రసానుభూతి పొందే గాత్రమాధుర్య మామెది.

. . . . . 14

ఈరోజు సన్మానితులు వియస్‌టి ఇండస్ట్రీస్ మేనేజింగ్ డైరక్టరు రవీ భూతలింగం. "సంగీత నాట్యాదుల ద్వారా దేశసమైక్యతకు, సమగ్రతకు తోడ్పడేందుకు మా వియస్‌టి ఇండస్ట్రీస్‌లోని సాంస్కృతిక విభాగం కొన్ని సంవత్సరాలుగా 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్' (Spirit of Freedom Concerts) నిర్వహిస్తూ యితోధికంగా పాటుపడుతున్నది. టివికె శాస్త్రిగారు మా ప్రయత్నాలకు ద్విగుణీ కృతోత్సాహ మిస్తున్నారు. ఇంత నిండుగా వున్న ఈ హాలే మీరు చూపుతున్న ఆదరణకు నిదర్శనం"- అన్నారు రవీ భూతలింగం ... భవానీ సుచిత్రల కూచిపూడి ప్రదర్శనానంతరం అజయ్ చక్రవర్తి హిందూస్థానీ గాత్రం.... చిట్టిబాబు వీణమొదలెట్టేసరికి, అంత పెద్ద మ్యూజిక్ అకాడమీలోనూ ఒక్కసీటు ఖాళీ లేదు. చిట్టిబాబు గురించి ఈనాడు కొత్తగా చెప్పవలసిందేమీ లేదు. దేశదేశాల లోని రసజ్ఞులని మెప్పించిన ఆ వీణా నాదంలో స్వరమాధురి వివిధానేక శబ్ద సౌందర్యలాస్యంతో, వెన్నెలసోనవలె




జెమిని పళ్ళపొడి
జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం. 7,
మచిలీపట్నం-521 001. ఆం.ప్ర. (ఇండియా)

పళ్ళకు తెలుపుదనం – చిగుళ్ళకు గట్టిదనం.

ప్రవహిస్తుంది. (వీరభద్రరావు మృదంగం - కళ్యాణరామన్ ఘటం) .... ముఖ్య అతిధిగా ప్లానింగ్ కమిషన్ మెంబరు టియన్ శేషన్ రావలసి వుంది. కాని, కారణాంతరాలవల్ల రాలేకపోయారు. ఆయన స్థానే మిసెస్ శేషన్ వచ్చారు.... చిత్రా విశ్వేశ్వరన్, సోనాల్ మాన్‌సింగ్ నాట్యప్రదర్శనల జుగల్ బందీ. ఒకరు భరతనాట్యం. మరొకరు ఒడిస్సీ. ఇరువురూ జగద్విఖ్యాతులు. ఒకరు విఘ్నేశ్వరుని, మరొకరు పరమశివుని ప్రార్థిస్తూ, విడి విడిగా నాట్యం ప్రారంభించి, ఆ మీదట సంయుక్తంగా వైవిధ్య సామీప్యాలతో ప్రేక్షకులని రసానంద లహరిలో మునకలు వేయించారు. సమైక్యతా కృషిలో తమ వంతు సాధనగా ఈ కళామూర్తులిరువురూ చేస్తున్న ప్రయత్నం ఆదర్శనీయమూ, అనుసరణనీయమూ, అభినందనీయమూను !

. . . . .15

సంగీత కళానిధి, పద్మ విభూషణ్ సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ గానకచ్చేరీతో (మృదంగం : భక్తవత్సలం : వయొలిన్ : మైసూరు నాగరాజ్) మద్రాసు తెలుగు అకాడమీ వారి ఈ నాటి సంగీతోత్సవం (స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్ - వియస్‌టి ఇండస్ట్రీస్ వారి సహాయ సహకారాలతో) ప్రారంభమయింది. ఇది మూడోరోజు - పండగల్లో చివరి పండగ. బ్రోచే వారెవరురా, రామజోగి మందుకొనరే - యిలాటివి సెమ్మంగుడి పాడుతున్నప్పుడు, ఎన్నిసార్లు విన్నా తనివి తీరదు. ప్రతీసారీ ఆ కంఠంలో కొత్త సోయగాలు పలుకుతాయి. గంటన్నర సేపు గానామృతం పంచిపెట్టారాయన. కూచిపూడి ప్రదర్శన యివ్వవలసిన సరళకుమారి అనారోగ్య కారణంగా రాలేకపోవడం వల్ల, ఆ గంట ఛాన్సు మాండలిన్ రాజుకి దక్కింది - శ్రీనివాస్‌కి నేర్పిన గురువే ఈ బాలునికీను ! మాండలిన్ శ్రీనివాస్ తర్వాత మాండలిన్ రాజునే చెప్పుకుంటామనడంలో ఎటువంటి సందేహం లేదు. సువర్ణ భవిష్యత్తుగల లేబ్రాయపు కళాకారుడు .... మొన్న సుబ్బలక్ష్మి సదాశివమ్‌ల కళ్యాణోత్సవమైతే, యివ్వాళ సెమ్మంగుడి దంపతులది. అరవైనాలుగేళ్ల క్రితం పెళ్లయిన ఆ జంట, యివ్వాళ మద్రాసు తెలుగు అకాడమీ వేదిక మీద, టిటికె ఆడిటోరియమ్‌లో (మ్యూజిక్ అకాడమీ హాలు) వధూవరులయారు. మొన్నటి పురోహితులే యివ్వాళ కూడా పెళ్లి మంత్రాలుచదివి, సెమ్మంగుడి గొంతుక పలికే రాగ సముచ్ఛయాన్ని మంత్రపుష్పంగా చేసి, ఆ 83 ఏళ్ల సంగీత సార్వభౌమునికి కళ్యాణోత్సవం జరిపించారు. యమ్మెస్ సుబ్బలక్ష్మి, యస్ జానకి, అంజలీదేవి, మిసెస్ భూతలింగం - ఈ పెళ్లికి పేరంటాళ్లు. ఓబుల్ రెడ్డి, రవీ భూతలింగం, బాలమురళీ కృష్ణ, టిటి వాసు, శ్రీకృష్ణ - పెళ్లి పెద్దలు. కిటకిటలాడుతున్న హాలులోని యావన్మందీ సదస్యులు. టివికె శాస్త్రి పాత్ర ఏమిటంటే,

అంతా తానై తిరిగే పెళ్ళి పెత్తందారు. విజయా శేష్‌మహల్‌లోను, రాజేశ్వరీ కళ్యాణమండపంలోను జరిగే పెళ్ళిళ్ల సామాన్యమైనవి. కాని, నేత్రోత్సవ మనదగు యిటువంటి పెళ్ళి చూడగల అదృష్టం ఆ నాటి ప్రేక్షకులకి మాత్రమే దక్కింది - ప్రతి ఒక్కరూ పదిలంగా, పవిత్రంగా, పూజ్య భావంతో గుర్తుంచుకొనే జ్ఞాపకమది .... మొన్న, ఇవ్వాళ కూడా కళ్యాణ దంపతులని ఎంతో విలువైన (ధర తెలిసినప్పటికీ వెల్లడించడం ఉచితం కాదు) పట్టు పీతాంబరాలతో సత్క రించిన ఘనత అకాడమీ ఛెయిర్‌మాన్ పి ఓబుల్ రెడ్డిది - సంగీత మంటే సమస్తం మర్చిపోగల రసార్ద్రత ఆయన హృదయ సంపద.... ఈ రెండు రోజులూ కళాకారులందరూ బాలమురళీకృష్ణకు పాదాభివందనం చేసినవారే; అయితే ఈరోజున మాత్రం బాలమురళి, సెమ్మంగుడికి పాదాభివందనం చేసి, ఆశీర్వచన మందుకున్నారు.... కేంద్రమంత్రి చిమన్‌భాయ్ మెహతా, రాష్ట్రపతి కార్యదర్శి పి. మురారి ఈనాటి ఉత్స వానికి అతిధులుగా రావలసి వుంది. కాని, ఢిల్లీలోని అనిశ్చిత పరిస్థితుల వల్ల (విపి సింగ్ రాజీనామా వ్యవ హారం - జనతాదళ్‌లోని అంతః కల హాలు) వారు రాలేకపోయారు.... జయశంకర్ నాదస్వరం (సుబ్ర హ్మణ్యం, అహ్మద్‌ఖాన్) కచ్చేరీ


జమ్మి వారి



కుమ్మా

పసిబిడ్డలకు యేర్పడు కామెర్లు (జాండీస్) ఆకలి లేమి, మలబద్ధకము, మలము తెల్లగా పోవుట, మూత్రము విసర్జించినచోట తెల్లగ మరక కట్టుట— మొదలైనవి లివరు వ్యాధి సూచనలగును.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు 'జమ్మి' వారి డాక్టరును సంప్రదించండి.

ప్రతినెలా వారిడాక్టరు మీ ఊళ్లకు వచ్చెదరు.

జమ్మి ఫార్మస్యూటికల్స్
'జమ్మి బిల్డింగ్స్'
**61**, రాయపేట హైరోడు, మద్రాసు - **600 004** - ఫోన్ నెం. **72539**

మంగళగీతంకాగా మూడోరోజు సంగీతోత్సవం అభినందన పరంపరతో, ఆనంద ప్రదంగా ముగిసి, మనసున ఒక రమ్యానుభూతిగా మిగిలింది.

. . . . . 28

"మా తాతగారు ఖజానా కోదండ రామారావు పంతులుగారి 'లా-పర్మ్' (న్యాయవాదసంస్థ) - 1872లో సోంపేటలో స్థాపించినది, మనదేశంలోని అతిపురాతనమైనదిగా చెప్పుకోవచ్చు. అల్లునిచేత బరంపురంలో ప్రాక్టీసు పెట్టించారు. అప్పటికింకా ఒరిస్సా రాష్ట్రం ఏర్పడలేదు - గంజాం జిల్లా అంతా మద్రాసు రాష్ట్రంలో భాగమై వుండేది. మా నాన్నగారూ, వివి గిరిగారి తండ్రి జోగయ్య పంతులూ ఒకే వృత్తిలోవున్న మిత్రులు. బచ్చు జగన్నాధదాసూ, మా నాన్నగారూ 'లా' కాలేజీ క్లాస్‌మేట్స్. చిన్నప్పుడొకసారి వారింటికి నాన్నగారితో వెళ్లాను.... అప్పట్లో వైష్ణవులకీ, స్మార్తులకీ వుండే పట్టింపులు తలుచుకుంటే, ఈనాడు ఆశ్చర్యంగా ఉంటుంది. 1872నాటి సోంపేట 'లా-ఫర్మ్' యిప్పటికీ జయప్రదంగా సాగుతోంది - అయిదవ తరంవారు నిర్వహిస్తున్నారు"- అని చెప్పారు ఆంధ్రప్రదేశ్ వోపెన్ యూనివర్సిటీ వైస్‌ఛాన్స్‌లర్ చంద్రశేఖరరావు, రాజాగారింట్లో చల్లబాటువేళ కబుర్లలో. శివవైష్ణవవైరాన్ని సంగీత సాహిత్యపరంగా సూచించే 'శివదీక్షా ప రు రా లి ని రా' రాగయుక్తంగా పేర్కొన్నారు. పోయిన నవంబరులో రాజ్యా - లక్ష్మీ అవార్డ్ ఫంక్షన్‌లో చంద్రశేఖరరావుగారి ఉపన్యాసం విన్నప్పట్నుంచీ ఆయనని కలుసుకోవాలని! రమణయ్య రాజా వ్యాపార దక్షులే కాదు, మిత్రుల మనోగతం తెలుసుకోగల దిట్ట.... సాయంత్రం ఏడుంపావుకి, మర్నాడు అమ్మకానికి వెళ్లే పాతన్యూస్‌పేపర్లు తిరగేస్తున్నప్పుడు, ఫోన్‌లో చెప్పారు రాజాగారు: 'చంద్రశేఖరరావుగారు వస్తున్నారు - మీరిద్దరూ రండి - పావుగంటలో కారు పంపుతాను' - అని. ఈ పూట ఎక్కడికీ వెళ్లడం లేదుకదా అని మా డ్రయివర్ని అయిదున్నరకి యింటికి పంపించేశాను. అంచేత, తీసుకెళ్లడం, దింపడం కూడా వారి వంతయింది. తీసుకెళ్లేందుకు మనుమడు వచ్చాడు; రాత్రి పదింముప్పావుకి దింపేందుకు వారి పెద్దబ్బాయి వెంకట్రావు.... చంద్రశేఖరరావుగారితో గడిపిన ఆ రెండుగంటలూ, భర్తృహరి చెప్పిన సజ్జన సారగత్యం అక్షరాలా! అమెరికన్ యూనివర్సిటీస్, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్, వోల్డ్ స్టూడెంట్ గుర్తించి నప్పుడు కలిగిన సంతోషం, దుర్గాబాయి దేశ్‌ముఖ్ మెమోరియల్ లెక్చర్, విద్యాపారీణతలో నేటి తరానికి గల అవగాహనశక్తి, ఆదిభట్ల నారాయణదాసు, మర్యాదలు - వ్యాపారులు - ఒకటేమిటి, ఎన్నెన్నో విషయాలు, చిన్ననాటి జ్ఞాపకాలతో చెప్పారు.

. . . . . 29

"భారతీయ భాషలన్నిటిలోనూ కథానికా జననం యించుమించు ఒకే విధంగా సంభవించింది. తెలుగు, కన్నడసాహిత్యాలలో ఆ సామీప్యత మరింత స్పష్టంగా కనిపిస్తుంది. తెలుగులో మొదటి కథానిక గురజాడ వారి 'దిద్దుబాటు' అని చెప్పుకుంటాం; కన్నడలో మాస్తి వేంకటేశయ్యంగారి 'రంగప్పవివాహం' అంటారు. తెలుగు కథానికకు ఆద్యులు గురజాడ కాదు, 1907 లోనే సాంఖ్యాయన శర్మ వ్రాశారు అని మనం అన్నట్లే, కన్నడి గులు కూడా 1907 లోనే పంచె మంగేష్ రాజు మొదటి కన్నడ కథానిక వ్రాశారంటారు. మాస్తి కూడా అదే మాట అంటారు. అయితే, కన్నడ సాహితీ కారులు మాస్తి వేంకటేశయ్యం గారినే ఆద్యులుగా చెప్పుకుంటారు - మనం గురజాడని అనుకుంటున్నట్టు ! కోలారు జిల్లాలోని మాస్తి అనే ఊరు ఈ మాస్తి వేంకటేశయ్యంగారిది. ఆయనకు తెలుగు బాగా వచ్చు - పధ్నాలుగు కథానికా సంపుటాలు వెలు వరించారు; పన్నెండు, పదమూడు సంపుటాలకు సాహిత్య అకాడమీ అవార్డ్ వచ్చింది. తాను చూసినవి, తన అనుభవంలో ఉన్నవీ మాత్రమే వ్రాశానని చెప్పారాయన.... కథానిక అనగా సమకాలీన ప్రపంచాన్ని ప్రతి


ఒక్కపలుకుచాలు పరిమళాలుచిలుకు

త్రివేణి







తీపి వక్కపొడి

కోట్లాదిప్రజలు
మక్కువతో కోరుకొనేది

త్రివేణి నట్‌పౌడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కో

బింబింపజేస్తూ, చదివే పాఠకుని ఆలో చింప జేసేదై, రమణీయార్థ ప్రతిపాదకంగా ఉండాలి. ముగింపులోని ఫెళుకుతో ఎగరేసే జెండా అవాలి. తూచి వాడే పదాలతో, శారీరక, మానసిక, ఆధ్యాత్మిక పొరలతో, జీవితం పట్ల మన అవగాహనని శ్రేయోదాయకమూ, ఆలోచనా పరమూ చేయగలగాలి. సర్దుకుపోవడం గాక, సరి దిద్దుకుపోవడం వైపుగా, భాషాపరంగా భావపరంగా ఒకటి అవుతూ, ముడి సరుకుని తీర్చిదిద్దిన శిల్పంలా మలిచి, హృదయ బంధాలు పెంచుతూ, అంతరంగిక సత్యం వెల్లడిస్తుంది కథానిక .... మనకు రాయలసీమ, తెలంగాణా. సర్కారు జిల్లాలు, ఉత్తరాంధ్ర వున్నట్లే, కన్నడిగులకు కూడా మండలాలు, మాండలికాలు వున్నాయి. సర్కార్ జిల్లాలదే సిసలైన తెలుగులా పత్రికల ద్వారా వ్యాప్తమైనట్లు, వారు మైసూరు కన్నడకే అగ్రస్థానమిస్తారు. ప్రఖ్యాత సాహితీవేత్త శివరామ కరంత్, సంయుక్త కర్ణాటకకి చెందుతారు-అభాష కొంచెం భిన్నం. అలాగే అడిగె గోపాలకృష్ణన్ ... 'మహారాష్ట్ర ప్రభావంతో వచ్చిన దళిత కన్నడ వేరు - ఫిలిమ్ దర్శక నిర్మాత లంకేష్ యిందులో ప్రసిద్ధులు.... కన్నడలో సాలీనా 1500 పుస్తకాలు వెలువడుతాయి; ఈ పుస్తక వివరాలు సేకరించే విభాగం ఉంది మైసూరు విశ్వవిద్యాలయంలో. తెలుగులో, నాకు తెలిసినంతలో, అటువంటి ప్రయత్న మింకా ప్రారంభం కాలేదు.... మనం సామాజిక స్పృహ అంటాము; వారు ప్రయోగశీలక మంటారు. రచయిత్రులలో అనుపమా నిరంజన్ చెప్పుకోదగ్గ గుర్తింపు పొందారు.... అనంత మూర్తి, ('సంస్కార్') అవన హళ్లి శ్రీకృష్ణ ('కాడు'), శాంతినాథ్ దేశాయ్, యశ్వంత్ చిటాలా - వీరు కన్నడకథానికకు విశిష్టత వొనగూర్చారు.... నెల జీతాలవారి వైనా, నేలబారు జీవితాల వారివైనా, కథానికలో వున్న చదునూ పదునూ, కాలక్షేపంతో బాటు కమనీయార్థ ప్రతి పాదకమవుతుంది.'' అన్నారు విరించి, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖవారు, పొట్టి శ్రీరాములుహాలులో ఏర్పాటు చేసిన 'సాహితీ సదస్సు' సందర్భంగా, కథానిక గురించి చెబుతూ!.... కన్నతల్లి రాజి, శిక్షణ పేరుతో తన కుమారుని విషయంలో కఠిన మనస్కురాలు కాగా, చుట్టం చూపుగా అక్కగారింటికి వచ్చిన రమ్య, రాజికి కనువిప్పు కలిగిస్తుంది వడ్లమాని కనక దుర్గ చదివిన స్వీయ కథానికలో. ప్రొఫెసరు గారి అల్పబుద్ధి కారణంగా తనకి క్లాసు రాకపోయినా, బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌గా జీవితంలో విజయ పథమందుకున్న వనిత కథ. జి లలితకు నచ్చిన కథానిక.... కూతురు లేచిపోగా, అవమానం భరించలేక మరొక ఊరు వచ్చి రిక్షా తొక్కుకు బతుకుతూండగా, అదే రిక్షా ఎక్కిన 'గాగుల్స్ యువతి' జాలిపడి, వందరూపాయలు నోటు యిచ్చినప్పుడు, ఈ రిక్షావాలా నిరాకరిస్తాడు

– తన కూతురు కంఠస్వరం గుర్తించి! ఇది తనకు నచ్చిన కథగా ఒకరు చదివారు. కించిత్ వాస్తవికత కూడా లేని కృత్రిమత్వమిది - అని ఆ రచనని చీల్చి చెండాడారు మల్లిక్. అధ్యక్షులు : బొమ్మిరెడ్డి పల్లి సూర్యారావు. ఈ సాహితీ కార్యక్రమానికి ముందు వీమల కొండ సోమేశ్వరరావు 'సోమన శతకం' ఆవిష్కరణ - మొదటి కాపీ డివి నరసరాజు అందుకున్నారు. షిర్డీసాయి బాబా భక్తులైన ఈ కవి గారు, వేమన శతకం మాదిరిగా ఇది రాశానన్నారు. అభ్యుదయసంఘ వేదిక మీద ఈ శతక ఆవిష్కరణ ఆశ్చర్యకరం.

. . . . . 31

"ఈ మధ్యనే జెకొస్లోవేకియాలో పర్యటించి వచ్చాను. అక్కడి ముఖ్య వివాదం 'జెక్' శబ్దానికి, 'స్లోవేకియా' శబ్దానికి మధ్య, హైఫన్ వుండటమా, వుండకపోవడమా అనేది. స్లోవక్‌లు హైఫన్ వుండితీరాలి; ఈ రెండు జాతుల కలయికే ఈ దేశం - అంటున్నారు .... 'సెరిస్ట్రాయికా' కారణంగా తూర్పుయూరప్ దేశాలపై సోవియట్ యూనియన్‌కున్న పట్టు సడలింది .... బాహాటంగా చర్చించే అవకాశంలేని కారణాన అధికారంలో వున్నవారు యిచ్చే లెఖ్ఖలు అబద్ధాల పుట్టలయాయి. వేర్వేరు తరహాలలో మూడుకోట్ల మంది ఉద్యోగులని పోషిస్తోంది సోవియట్ యూనియన్. అదే విధంగా జెకొస్లోవేకియా జనాభా 17లక్షలలోను, 2 లక్షల మంది ఉద్యోగులు, పార్టీమెంబర్లూను. వారికే అన్ని సదుపాయాలూ అవడం వల్ల ఆర్థిక వ్యవస్థ కూకటివేళ్లతో దెబ్బ



## సినిమా పేరు ?

**మమతలున్న మనసులో కొలువుంటాడు**
**కరుణగల కళ్లలో కనుపిస్తాడు**

**గేయరచన: ఆత్రేయ; పాడినవారు: ఘంటసాల**

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లువేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

**మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 10-10-1990**



**JAGATI, 2, Kutchery Road, PB 2922, Mylapore, Madras-600 004.**



తిన్నది. స్వంత ఆస్తులు, స్వేచ్ఛా వర్తక వ్యాపారాలు - యివే తమ జీవితాలను ఒకదరికి జేర్చగలవనే నమ్మకం ఏర్పడింది ప్రజానీకంలో..... సోవియట్ యూనియన్ లోను, సోవియట్‌బ్లాక్ దేశాలలోను సంభ విస్తున్న ఈ మార్పుని 'కమ్యూనిజమ్' చరమ వాక్యంగా భావించకూడదు ఇన్నాళ్లూ 'రూబుల్' తమ దేశానికే పరిమితమై వుంది; అంచేత, ఇన్‌ఫ్లేషన్ (ద్రవ్యోల్బణం) అంటే ఏమిటో వారికి తెలీదు. ఇక ముందు 'రూబుల్' మడిగట్టుకు కూచోడం కుదరదు - అంతర్జాతీయ రంగంలో ప్రవేశించవలసిన ఆవశ్యకత ఏర్పడు తుంది," - అన్నారు డా॥ సుందరం అమెరికన్ సెంటర్ వారు తమ సెమినార్ రూమ్‌లో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఇష్టాగోష్టిలో. ఈ కార్యక్రమంలో పాల్గొన్న పది పది హేనుగురిలో దౌత్యనిపుణులు, విద్యా వేత్తలు, సంఘసేవా పరాయణులు, సాహితీపరులు వున్నారు. మనో కవాటాలు తెరిచే 'స్టిమ్యులేటింగ్ డిస్కషన్.' ప్రోగ్రామ్ ఆఫీసరు మైకేల్ పెల్లెటీర్ (Michael P Pelletier). పరిచయ వాక్యాల తర్వాత సుందరం మాట్లాడారు. ఆ తర్వాత వారి వారి అభిప్రాయాలూ, కామెంట్స్, వివరిని ప్రధానవక్తసమీక్ష. 150 నిముషాలు 150 సెకనులలా దొర్లిపోయాయి .... 'ఏ దేశంలోని ప్రగతికైనా, సగం జనాభా అయేస్త్రీల స్థానమూ, వారికిచ్చే గౌరవమర్యాదలూ ప్రధానమవుతాయి. 'క్వాలిటీ ఆఫ్‌లైఫ్'ని తీసుకుంటే, అర్ధ సంపద పుష్కలంగా ఉన్నప్పటికీ, అమెరికా ఎంత మాత్రం ఆదర్శ ప్రాయం కాదు,' - అన్నారు ఒకరు. '1806లో నెపోలియన్ యూరప్ ఖండ దేశాలన్నిటినీ ఒక బావుటా కిందకి తేవాలనుకున్నాడు. 1847లో విప్లవం. 1850లో కాంగ్రెస్ ఆఫ్ వియన్నా - 'లీగ్ ఆఫ్ నేషన్స్' ఉద్భ వించడానికి ముందు జరిగిన 'శాంతి' ప్రయత్నం. ఆ తర్వాత 1870, '71, '72లలో ప్రష్యన్ యుద్ధాలు .... బ్రిటన్ వీటికి దూరంగా ఉంది. జాతులు, జాతుల అహంకారాలు, వేర్వేరు జాతుల సమ్మిశ్రిత దేశాలు - యివన్నీకూడా ఆర్థిక ప్రభావాలకు లోనుగాక తప్పదు. అమెరికా, యూరప్, జపాన్ - ఈ మూడు ప్రధానమైన ట్రేడింగ్ జోన్స్ కాను న్నాయి. ఈ భవిష్యత్ స్వరూపంలో ఇండియా చైనాల పాత్ర ఏ తీరున ఉంటుందో యిప్పుడప్పుడే చెప్పలేము - నాల్గవ ప్రాంతంకావచ్చు. వీరి 'వాల్యూ - సిస్టమ్స్' చాలా ఘట్టివి,' - అన్నారు మరొకరు. రెండు నెలల క్రితం సోవియట్ యూనియన్ చూసివచ్చిన ఒకరు, 'మాస్కోవీధులలో అమెరికన్ జీన్స్‌కోసం, అమెరికన్ వస్తువులకోసం పదే వెంపర్లాట విచిత్రంగా ఉంది - వారికి కావల్సింది అమెరికనులవే - మిగతా దేశాలవి అఖ్కర్లేదు' - అన్నారు. మొత్తం మీద ఎంతో విజ్ఞాన ప్రదంగాను, ఉత్తేజకరంగాను వుంది ఇష్టాగోష్టి .... సూలంగా యూరప్

చరిత్ర సామ్రాజ్యాల కథ. బ్రిటిష్ సామ్రాజ్యం, ఫ్రెంచి సామ్రాజ్యం, 'లాండ్ - లాక్‌డ్' ఆష్ట్రో హంగేరియన్ సామ్రాజ్యం ('లాండ్ లాక్‌డ్ అనగా నలువైపులా భూభాగమే తప్ప ఓడరేవు లేక పోవడం), ఉష్ణజల సముద్రానికై తహ తహలాడే రష్యన్ సామ్రాజ్యం. చివరి రెండిటికీ గిట్టని తురుష్క సామ్రాజ్యం (ఒట్టొమాన్ ఎంపైర్) - - యివన్నీ మొదటి ప్రపంచయుద్ధం ఫలితంగా ఛిన్నా భిన్నమయాయి; అస్తిత్వం కాపాడుకోలేని చిన్నచిన్న దేశాలు తలఎత్తాయి. వాటితోటే నేషన్ - స్టేట్, నేషన్‌లిజమ్ అనే భావాలు అంకురించాయి. రెండవ ప్రపంచ యుద్ధంతో బ్రిటన్, ఫ్రాన్స్, హాలండ్ మున్నగు దేశాలు తమ వలసలన్నీ పోగొట్టుకున్నాయి. ఆ వలసలు స్వతంత్ర దేశాలయాయి. ఇప్పుడు తూర్పుయూరప్ దేశాలు సోవియట్ యూనియన్ నుంచి విడిపోయి, ప్రజాస్వామికాలయాయి. అయితే, ఈ డెమొక్రటైజేషన్‌పై ఆర్థిక ప్రభావమెంత? - అనే ప్రశ్నవస్తోంది. ఈ చిన్నచిన్న దేశాలు 'సావరిన్ స్టేట్స్'గా మనుగడ సాగించగలవా? ఒక కలకత్తా కంటె, ఒక టోక్యోకంటె తక్కువ జనభాగల దేశాలు చాలావున్నాయి యూరప్‌లో. వీరందరి దృష్టి యూరోపియన్ కామన్ మార్కెట్ సభ్యత్వం కోసం. అది తప్ప మరోమార్గం లేదు. పోలెండులో 47 పార్టీలు వున్నాయి; యుగోస్లావియాలో 17 పార్టీలు పని చేస్తున్నాయి - 90 పార్టీలు గుర్తింపు కోసం అప్లికేషన్ పెట్టుకున్నాయి. "డెమొక్రటైజేషన్' అంటే బహుళ సంఖ్యలో రాజకీయ పార్టీలు, పరస్పర నిందలతో ప్రజను మభ్యపెట్టడమా? కాదు, కాదని విజ్ఞులందరూ వొప్పుకుంటున్నారు .... ఫ్రాంజ్‌కాఫ్కా, సిగ్మండ్ ఫ్రాయిడ్‌ల వియన్నా ఒకనాడు కేంద్ర యూరప్‌కి (Central Europe) సాంస్కృతిక కేంద్రం. ఆ సెంట్రల్ యూరప్ కాలగర్భంలో కలిసిపోయింది. నేడు కనిపిస్తున్నది రాజకీయ కల్లోలాల 'మిడిల్ యూరప్' - Middle Europe (మధ్యయూరప్).

—యన్నార్ చందూర్



పృథ్వీ మాత కన్నీరే ఆమెను నిత్య శోభితంకా ఉంచుతున్నది. మనలోగల కోరిక, మనక తెరను ఇంద్ర చాపంగా చేస్తుంది. తప్పులన్నిటికీ తలుపు మూసివేస్తే, నిజమనేది వాకిటిలోకి రాదు. ప్రపంచాన్ని తలకిందులుగా చదివి, లోకం మనని మోసగిస్తున్నదని అంటాము.

స్వప్నమనేది మాటలు ఆ పని సతి: నిద్ర అనేది ఓపికగా భరించే పతి.

ఫలరాజమా, నీవు నాకెంత దూరం? - పూబాలా, నీ హృదయం లో నేనున్నాను.

రాగ స్రవంతి హృదయంలో ఉన్నప్పుడే సౌశీల్యమనే సంపద సమకూడుతుంది.

—రవీంద్ర వా[illegible]



# కేంద్ర సాహిత్య అకాడెమి



## కొత్త ప్రచురణలు

- ☐ వెయ్యిన్నొక్కరాత్రులు (అరేబియన్ నైట్స్)
  — అనువాదం : ఘండికోట బ్రహ్మాజీరావు — రు. 60
- ☐ కలకత్తాకి దగ్గిరలో (సాహిత్య అకాడెమీ బహుమతి హొందిన బెంగాలీ నవల)
  — గజేంద్ర కుమారమిత్ర. అనువాదం : మద్దిపట్ల సూరి — రు. 40
- ☐ రొయ్యలు (బహుమతి పొందిన మళయాళీ నవల)
  — తగళ శివశంకర పిళ్ళై. అనువాదం : జి. సుబ్బరామయ్య — రు. 35
- ☐ కలసిన జీవితాలు (బహుమతి పొందిన గుజరాతీ నవల)
  — పన్నారాల్ పటేల్. అనువాదం : వి. ఆంజనేయశర్మ — రు. 35
- ☐ కబీరు వచనావళి
  అనువాదం : పుట్టపర్తి నారాయణాచార్యులు — రు. 30

## భారతీయ సాహిత్య నిర్మాతలు

(ఒక్కొక్క ప్రతి వెల రు. 10/-)

☐ గుడిపాటి వెంకటచలం ☐ పోతన ☐ వేమన ☐ రాహుల్ సాంకృత్యాయణ ☐ గాలిబ్ ☐ సరోజినీ నాయుడు ☐ రాజా రామ్ మోహన్ రాయ్ ☐ బంకించంద్ర చటర్జీ ☐ ఎ. ఆర్. రాజరాజవర్మ ☐ హరి నారాయణ ఆప్టే ☐ ధర్మవరం రామకృష్ణమాచార్యులు ☐ ఉ.వే. స్వామినాథ అయ్యరు ☐ గిడుగు వెంకటరామమూర్తి ☐ శ్యామ సుందరదాస్ ☐ గురజాడ

## ఇతర ప్రచురణలు

కావ్యమాల (సం : దేవులపల్లి రామానుజరావు) — రు. 25
తెలుగు కావ్యమాల (సం : కాటూరి వేంకటేశ్వరరావు) — రు. 30
తెలుగు కథ (సం : డి. రామలింగం) — రు. 40
మరాఠీ కథా సంగ్రహము (సం : వి.కె. భగవత్) — రు. 15

**సాహిత్య అకాడెమి**

దక్షిణ ప్రాంతీయ కార్యాలయం

29, ఎల్డామ్స్ రోడ్డు, మద్రాస్ – 600 018....(ఫోన్ : 454080

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ : డాక్టరు నాగార్జునకు పెద్దవాళ్లు పెళ్లి సంబంధాలు చూదా మనుకుంటూ వుండగా, చెల్లెలు చందన 'విశాలమీద మనసున్నదని చెప్పేయ కూడదూ ?' అంటుంది అన్నగారితో. విశాల అనుమతి లేకుండా వెల్లడించడం సభ్యత కాదంటాడతను. సివిల్ ఇంజనీరైన విశాలకు యిద్దరు చెల్లెళ్లు - శర్మిల, విమల. ప్రమీలా సూర్యారావు దంపతుల పాలిట వారిద్దరూ ప్రాబ్లెమ్ గరల్స్. శ్రీనివాసరావు కూతురు లావణ్య ని ట్రీట్ చేస్తున్నాడు డాక్టరు నాగార్జున. ఈ యువకునిపై ఆశలు పెంచు కుంటోంది లావణ్య.... (ఇక చదవండి

ఆ పెడసరపుమాటలకు ప్రమీల మనసు మండిపోయింది. "ఆల్ రైట్ .... అతనిమీద అంత నమ్మకం వుంటే .... సంతోషం కాని.... పరారుగా పారిపోయి జీవితాన్ని బలి పెట్టు కోవద్దు. మమ్మీ వాళ్ళకి బాధకలిగించ వద్దు. డాడీకి చెప్పి అన్ని ఏర్పాట్లు చేయిస్తాం. అంతవరకు ఓపికపట్టు," అంది విశాల.

"అదెలా విశాలా.... పెద్దవాళ్ళు నీవు, విమ్మి వుండగా.... దీనికి తొందర...."

"ఫర్వాలేదు మమ్మీ.... దీపం వుండగానే ఇల్లు చక్కదిద్దుకోమన్నారు. అనాలోచితంగా ఇల్లు విడిచి వెళ్తే శమ్మి భవిష్యత్తు ఏంగాను ?"

ప్రమీల గుండె ఝల్లుమంది.

### 17

ఈ విషయం తెలిసిన సూర్యారావు ముందు ఉగ్రుడైనాడు. ప్రమీల, విశాల.... ఎంతో నచ్చచెప్పారు. చివరికి సమ్మతించాడు. ఆయనకి అప్పు డర్థమయింది.... అతి గారాబం చేసి, తెచ్చుకున్న పరిణామం.

ఆడపిల్ల తండ్రిగా అభిమానాన్ని వదలి, వాళ్ళఇంటికి వెళ్లాడు - శమ్మి జీవితం ఒక దారికి చేర్చాలనే ఉద్దేశంతో!

శేషాద్రి ఒక్కడే కొడుకు - తల్లి ఒక రుద్రకాళి. సూర్యారావుని చూసి అవహేళనగా మాట్లాడింది.

"ఆడపిల్లల తల్లి దండ్రులకు ఇదొక వ్యాపారమైపోయింది. ముందు అమ్మా యిని, అబ్బాయి వెంట తిరగనివ్వటం, ఆ తరువాత పెద్దవాళ్ల కాళ్లావేళ్లా పడ టం...."

సూర్యారావుకి ఉక్రోషం వచ్చి, "ఆమాట కొస్తే మీరు చేసేదేమిటి ?

మగపిల్లాడిని ఎరపెట్టి కట్నం గుంజు కోవాలనేగా" - అన్నాడు కసిగా.

"ఎందుకండీ మాటలు, మీకు మగ పిల్లలేరు గనక గాని వుంటే మీరు మాత్రం కట్నం విడిచి పెట్టేవారా....?"

సూర్యారావు నిగ్రహించుకొన్నాడు. తను వచ్చిన పని మరచి, తర్కంలోకి ఎందుకని మనసు సరిపుచ్చుకుని అడిగాడు .... "అలా అనుకుంటే మీ అబ్బాయి మా అమ్మాయి వెంట తిరిగాడు కదండీ?" ముహూర్తాల దాకా వచ్చేశారే .... "మా అబ్బాయి ఎం.ఎ పూర్తి చేస్తే లక్షా ఏభైవేలు కట్నం ఇస్తామంటున్నారు .... తెలుసా!" కూడ కట్టుకున్న సహనం సడలి పోయింది. "నా బిడ్డ జీవితం బాగు పడుతుందని, ఆడపిల్లతండ్రినని అభిమానాన్ని చంపుకుని వచ్చి అడిగితే ఇంత అవమానం చేస్తారా? మీరు మనుషులా, .... రాక్షసులా ....?" అని విసురుగా అనేసి వచ్చేశాడు. గుండెల్లో బాధగావుంది - ఎలాగో ఇల్లు చేరుకోగలిగాడు.

"శమ్మీ!".... ఆ పిలుపుతో ఇల్లు ప్రతిధ్వనించింది.

శమ్మి ఒణికి పోయింది. అందరూ అలాగే నిలచిపోయారు. శమ్మి రెక్క పట్టుకుని తన వైపుకు తిప్పి.... "ఎందుకిలా చేసావ్.... చదువుకోమని పంపితే, దిక్కుమాలిన స్నేహం చేసి, మా గౌరవం మంటకలుపుతావా?" చేయెత్తాడు.

.. ఇన్నాళ్ళు ఇంత అల్లారు ముద్దుగా పెంచి, ఈనాడు చేయి చేసుకోబోతున్నారా?".... తనని ఆపిన విశాలవైపు చూశాడు.

ఆమె పట్టుకున్న ఆ చేతిలో, ఆ స్పర్శలో ఓదార్పు - ప్రేమ వున్నాయి. అతని స్వరం గద్గదికమైపోయింది.

"ఇన్నాళ్లు నిన్ను విమర్శించాను.... కాని, నీవే ఒక ఉన్నతమైన తీర్పు చెప్పే అవకాశం వచ్చింది. చేసిన పాపం, చేసిన తప్పు ఎక్కడికీ పోవమ్మా! ఎవరైన తమ తప్పిదాల ఫలితం అనుభవించి తీరాలి." గుండె పట్టుకుని నేలకూలి పోయారాయన.

"డాడీ.... డాడీ...." అందరూ.... చుట్టూచేరారు.

## 18

సూర్యారావుకి హర్ట్ ఎటాక్. రెండు వారాలు హస్పటల్లో వున్నారు ఈ రెండు వారాలూ ప్రమీలతో బాటు విశాలే ఆయన దగ్గరుండి సపర్యలు చేసింది. రాత్రుళ్లు హస్పటల్ లో విశాల వుంటే, ఇంటివద్ద ప్రమీల వుండేది.

విశాలకి బి.ఇ లో ఫస్టుక్లాస్ వచ్చింది. విమ్మి బి.యస్.సి ఫెయి లయింది. శమ్మి అసలు పరీక్షలు సరిగా రాయనే లేదు.

ఒక రోజున మౌనంగా వున్న తండ్రిని: "డాడీ ఏమిటి అలా వున్నారు?" - అడిగింది విశాల.

'ఏమీ లేదమ్మా,

"చూడండి, డాడీ.... మీరు అన్ని విషయాలు మరచిపోయి, నిశ్చింతగా వుంటేనే ఆరోగ్యం బాగుపడుతుంది".

"ఎలా.... వుండనమ్మా.... ఇంటి గోడలు కూలిపోతుంటే ?"

"గోడలు కూలిపోవడం లేదు, మీ డిసిప్లిన్‌లో ఏదో పొరబాటు జరిగిందని బాధపడుతున్నారు. అందరం విధి ప్రేరితులమే కదా, డాడీ! 'తన', 'మన', అనేది వుంటూనే వుంటుంది. కాని ఒక్కోసారి దాని పర్సంటేజ్ పెరిగిపోవటంతో స్వయంకృతమనే మనోవ్యధకు గురిఅవుతాము. నిరాశ్రయులమైన అమ్మకు, నాకూ కొత్త జీవితం ప్రసాదించారు. మీ ఔన్నత్యం మీకు తెలియదు - ఫలం అనుభవించి ఇంజనీరునైన నాకు తెలుసు."

సూర్యారావుకి మతిపోయింది. సంవత్సరాల తరబడి ఒకే యింట్లో జీవిస్తున్నప్పటికీ ఎంత తక్కువ తెలుసు ఒకరి గురించి మరొకరికి.

"చాలమ్మా.... చాలు.... ఇక చెప్పకు. మీ అమ్మనూ.... నిన్నూ నా కంటిపాపల్లా చూసుకొన్నది నిజమే! అయితే నాకు పిల్లలు కలుగనంత వరకు. వాళ్ళు పుట్టాక నీమీద మమత ఎలా పోయిందో.... ఎప్పుడు పోయిందో.... తలచుకుంటే ఆశ్చర్యం




అందం చిందే సుఖారమైన చర్మమునకు ఎల్లప్పుడు వాడండి.

అశోకా
శాండల్ వుడ్ టాల్కం పౌడర్లు

ASOKA
ALL PURPOSE
SANDAL WOOD
Powder

ASOKA
Sandalwood
TALCUM POWDER

ASOKA
Sandalwood
FACE POWDER

ఆస్లా
బ్రిలియన్‌టయిన్
నల్లని కురులకు
చల్లదనమునకు
తప్పక వాడండి




గా ఉంది. నా కళ్ళు తెరిపించేందుకే .... ఈ హార్ట్‌యటాక్ వచ్చిందేమో! దేవుడు చేసే పనులు ఎంత విచిత్రంగా వుంటాయో!"

"ప్లీజ్, డాడీ .... వెనకటివన్నీ మరచిపోండి. ఇంకొకసారి.... గుర్తు తెచ్చుకున్నారంటే వూరుకోను.

భోజనం పూర్తికాగానే ముక్కలు కోసి.... ఒక్కొక్కటి అందిస్తూ చెప్పింది. "డాడీ ఒక కంపెనీలో జాబ్ దొరికింది," హ్యాండ్ బాగ్‌లో నుండి అపాయిమెంట్ లెటరు తీసి చూపించింది. సూర్యారావు చాలా సంతోషపడ్డారు.

"ఎప్పుడు జాయిన్ కావాలి ?"

"నాలుగు రోజుల్లో"

"అమ్మకు చూపించావా ?"

"చూపించాను.... మీకు చెప్పి మీ పర్మిషన్ తీసుకోమంది"

గతం ఆయన కళ్ళ ముందు కదలాడింది. ఇరవై ఏళ్ల క్రిందట ప్రమీలతో మొదటి పరిచయం. తను మేనేజరుగా చేరినప్పుడు, ప్రమీల ఆ బ్యాంకులో టైపిస్టు.

చక్కగా తీర్చిదిద్దినట్లున్న ఆ ముఖంలో ఏదో వెలితి.... సిందూరం లేదు. క్రిస్టియనా, ఫాషన్ కాదని పెట్టుకోలేదా లేక.... ఇంత చిన్న వయసులో....

కొద్ది రోజులు పోయాక తెలిసింది. ఆమె భర్త స్కూటర్ యాక్సిడెంట్‌లో పోయాడని! పాప కూడ వున్నదని. ఆమె ఎప్పుడూ తన పనేమిటో తప్ప మరొకటి మాట్లాడదు. ఒకసారి ధైర్యంగా తన మనోగతం చెప్పాడు. పెళ్ళి చేసుకుంటానన్నాడు.

ఆమె అంగీకరించ లేదు. తనకు బిడ్డవుంది. ఆ పాపను బాగా చదివించి వృద్ధిలోకి తేవడమే తన ధ్యేయమంది.

ఆ పాప బాధ్యత కూడా తనే తీసుకుంటానన్నాడు. అయినప్పటికీ ఆమె అంగీకరించ లేదు. చివరికి అతికష్టం మీద, ఆఫీసరు స్థాయిలో వున్న అతని అభ్యర్ధనని కాదనలేక పెళ్ళికి వొప్పుకుంది. విమ్మి, శమ్మి, పుట్టాక విశాల మీద ఎందుకనో మమకారం కొంత తగ్గిన మాట నిజమే.

"డాడీ.... ఏమిటాలోచిస్తున్నారు?"

"ఏమి లేదమ్మా !"

"మరి జాయిన్ అవమంటారా...?"

"తప్పకుండా...."

"థాంక్యూ డాడీ...."

## 19

"డోంట్ వరీ, డియర్.... ఒక చిన్న ప్లాన్‌తో మీ పేరెంట్స్ దారిలో కొచ్చేస్తారు." - పార్కులో శమ్మి వడిలో తల పెట్టుకు పడుకున్న శేషాద్రి అన్నాడు.

"ఏమో నాకు భయంగా వుంది.... మా డాడీ ఈ పెళ్ళికి ఒప్పుకునేలా లేరు." చెప్పింది శమ్మి దిగులుగా.

"చెప్పాను కదా ఈ ప్లాన్‌తో...."

ఆమెకు చెవిలో చెప్పాడు ఆ ప్లాన్ .... మొదట్లో అయిష్టత కనపరిచి, చివరికి సరే అంది శమ్మి.

"ఇవన్నీ ఎందుకు ? మనం రిజిష్టర్ మ్యారేజి చేసుకుందాం"

(ఇంకా వుంది

Regd No. M 6713 JAGATI RNI 1119/57 - Oct 90

BROWN LIBRARY


# జననం
## లేక
# మరణం

## ఇది మీ కుటుంబంలో సంభవించినప్పుడు మీ స్థానిక రిజిస్ట్రారుతో తప్పక రిజిస్టరు చేయండి

ఇది మీకు చాలా సహాయకారి కాగలదు

జనన ప్రమాణపత్రం
వయస్సుకు నిదర్శనం

- స్కూలులో ప్రవేశానికి
- ఉద్యోగం సంపాదించుకోవటానికి
- ఓటు హక్కును వినియోగించుకోవటానికి
- డ్రైవింగు లైసెన్సును పొందటానికి
- పాస్‌పోర్టును పొందటానికి
- జీవిత భీమా పాలసీని తీసుకోవటానికి

మరణ ప్రమాణపత్రం
వీటికి అవసరం

- ఆస్తిని వారసత్వంగా పొందటానికి
- జీవిత భీమా ధనాన్ని పొందటానికి
- ఆస్తి సంబంధిత సమస్యల పరిష్కారానికి

## సకాలంలో రిజిస్టరు చేసి ప్రమాణపత్రాన్ని ఉచితంగా పొందండి

చట్ట ప్రకారం జనన, మరణాలను రిజిస్టరు చేయటం తప్పనిసరి.
ఆలస్యంగా రిజిస్టరు చేయటానికి కూడా అనుమతి లభిస్తుంది.



## రిజిస్ట్రారు జనరల్, ఇండియా

davp 90/146 Tel